# శ్రీమద్భగవద్గీత

## తెనుఁగు గీతములు

గార్లంక వీరవేంకటసత్యనారాయణ, బి.ఏ., ఎల్.టి.,



# ఆస్తిక జనావళికి విజ్ఞప్తి

ఉదార హృదయులారా!

ఈ గ్రంథరత్నం యొక్క వేయి (1000) ప్రతుల ప్రచురణ వితరణ నిమిత్తం తమ ఫొటోతో వంశ పరిచయంతో రు. 8000/- లు అందజేయు వారికి ద్రవ్యం అందిన 21 రోజుల తర్వాత 900 ప్రతులు అందజేయగలము.

వివరములకు :

పురాణపండ రాధాకృష్ణమూర్తి
భాగవత మందిరము
జయశ్రీ టాకీస్ రోడు
హోటలు సూర్య ప్రక్కన
రాజమండ్రి - 533 104

ఓమ్

# శ్రీమద్భగవద్గీత
## తెనుగు గీతములు

గార్లంక వీరవేంకట సత్యనారాయణ
బి.ఎ., ఎల్.టి.

ఓమ్

# శ్రీమద్భగవద్గీత
## తెనుగు గీతములు

విషయ సూచిక

# ప్రార్థన

నీకు మనసిచ్చి భక్తితో నిన్నుగొల్చి
నీకయి యజించి నమసులు నీకు జేసి
స్వాత్మధర్మమొనర్చి నిన్నాశ్రయింతు
నేలునను బార్థసఖుడ యోగీశ కృష్ణ॥



స్వర్గీయులు శ్రీ గార్లంక వీరవేంకట సత్యనారాయణ
వారి సతీమణి శ్రీమతి సత్యవతి

మా తండ్రిగారు, శ్రీ గార్లంక వీరవేంకట సత్యనారాయణగారు, శ్రీమద్భగవద్గీతను తెనుగు గీతములలో అనువదించిరి. ఆ గీతములను ఈ పుస్తక రూపములో ఆధ్యాత్మిక చింతన కలిగిన మహోదయులకు అందజేయు భాగ్యము మాకు కలిగించిన భగవానునకు మా కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

ప్రకాశకులు

ఓమ్

## పూజ్యపాదులు శ్రీ గర్లంక వీరవేంకట సత్యనారాయణగారి జీవిత పరిచయము

శ్రీ గురుభ్యోనమః

*"ఆకార సదృశః ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః*
*ఆగమో సదృశా ఆరంభః ఆరంభ సదృశోదయః!*

మల్లెల వంటి తెల్లని ఖద్దరు వస్త్రములు – నిష్కల్మష హృదయము దీపించు ముఖవర్చస్సు – ఆనందము చిందించు సుందర మందహాసముతో శిల్పి చెక్కిన స్వర్ణశిల్పంలా నా మనసున నిలిచిన కొత్తపేట బోర్డుహైస్కూలు ఆదర్శ ప్రధానోపాధ్యాయులు శ్రీ గర్లంక వీరవేంకట సత్యనారాయణ గారు.

తూర్పుగోదావరి జిల్లా పెద్దాపుర గ్రామమున జన్మించి మాతృమూర్తి అందించిన స్ఫూర్తితో BA LT డిగ్రీలంది ఉపాధ్యాయునిగా ప్రధానోపాధ్యాయునిగా అనేక సంవత్సరములు విద్యాసేవచేసి ఉద్యోగ విరమణ చేసిరి. వృత్తిరీత్యా పదవీ విరమణ గావించినను ప్రవృత్తి రీత్యా ఆమరణాంతం విద్యాబోధకులుగానే జీవింప గలుగుట వీరి పూర్వజన్మ సుకృతము.

వేదకాలమున ఆశ్రమ సంస్థాపకులు గురుపీఠముననుండి తామే "విశ్వవిద్యాలయము"గా భాసిల్లుట చరిత్ర చెప్పే సత్యము! పాఠశాలల రూపమున విద్యావ్యాప్తికి ప్రభుత్వమారంభించిన తరువాత తాము బోధించు తరగతినే విశ్వవిద్యాలయముగా రూపొందించు ఉపాధ్యాయులు – అట్లే తాము నడిపించు పాఠశాలనే విశ్వవిద్యాలయముగా దీపింపజేసిన ప్రధానోపాధ్యాయులు మనచరిత్రలో ఉన్నారు. ఉంటారు! గురువు జ్ఞాన ప్రదాత అనుట త్రికాల సత్యము కావున అన్నికాలములందును అట్టి గురువులు ఉండితీరవలెను కదా !

శ్రీ సత్యనారాయణగారు – ఒక కవి ప్రవచించినట్లు – "అతడు కనరాని విశ్వవిద్యాలయము" అని పాఠశాలానిర్వహణ ద్వారా నిరూపించినారు. ప్రతి వ్యక్తి యందును సర్వవ్యాపక సర్వ శక్తియుత జ్ఞానము దైవరూపమున నుండు ననియు – దానిని వ్యక్తము చేసికొనుటకు విద్య సహకరించు ననియు శ్రీ వివేకానందులు గ్రహించి Man making education, Man making religion అనురెండు సూక్తులతో సనాతన ధర్మ ప్రబోధక విద్యావిధానమును వివరించిరి. ఆ స్ఫూర్తి నందుకొని ప్రభుత్వపుటుత్తరువుల కనుగుణముగా విద్యా విధానమును రూపొందించిన ప్రప్రథమ ప్రధానోపాధ్యాయులు శ్రీ సత్యనారాయణగారు!

భారతీయ విద్యా విధానములోని దైవీభావమును – నేటి విద్యావిధానమునగల కేవల విషయసేకరణను – సమన్వయ పరచి ఉత్తమ భావిపౌరులను రూపొందించుటకు బాటలు వేసిరి! పాఠశాలను "పాఠశాలామతల్లి" యనుటయే వారి అలవాటు!

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి " యనునది వారి నిత్య ప్రవచనము! అక్షరసత్యముగా అట్లే జీవించిన ఆదర్శమూర్తి శ్రీ సత్యనారాయణగారు! ఇదియే వేలాది విద్యార్థులకు స్ఫూర్తినిచ్చినది! వీరు నూతనముగా ప్రవేశపెట్టిన "మాస్‌డ్రిల్లు" – "ప్లే ఫర్ ఆల్" కార్యక్రమాలు ఉన్నతాధికారులను సైతము ఉత్తేజపరచి ఆలోచింపజేసినవి! ఆనాడువారు ప్రవచించిన విద్యాబోధన సిద్ధాంతాలే యీనాటి నవోదయ పాఠశాలలకు పునాదులు! వీరు చేసిన మరియొక ప్రయోగము " The lost and found Department" నైతికబోధకసంస్థ అందరి దృష్టిని ఆకట్టుకొన్నది.

ఆనాటి ఆంగ్లేయ డైరెక్టరు అమిత గౌరవముతో శ్రీ సత్యనారాయణగారిని "రాష్ట్రవిద్యా ప్రణాళికా సంఘము" "పాఠ్య పుస్తక నిర్ణయ సంఘం" "పాఠ్యాంశ ప్రణాళికా సంఘం" "పరీక్షా నిర్వహణ సంఘము" ఆదిగా గల సంఘములందు సభ్యునిగా నియమించిరి! ఆవిధముగా ఉపాధ్యాయపదవికే వన్నె తెచ్చిన మహానుభావులు శ్రీ సత్యనారాయణగారు! బోధనా విధానంలో నూతన మార్గములను చూపించి విద్యార్థులకే కాక ఉపాధ్యాయులకు – సాటి ప్రధానోపాధ్యాయులకు కూడ మార్గదర్శకులనిపించు కున్నారు.

నేను అక్షరాభ్యాస మారంభించిన భవన ప్రాంగణమే యీనాడు "విశ్వకవివేమన ప్రభుత్వ కళాశాలగా రూపొందుట "వివేకానంద విజ్ఞాన అధ్యయన సమితి" ఆవిర్భవించుట – శ్రీ సత్యనారాయణగారు ఆధ్యాత్మిక ప్రబోధము గావించిన ప్రదేశమునందే జరుగుట వారి ఆత్మౌన్నత్యమునకు నిదర్శనము.

శ్రీ సత్యనారాయణగారు ఉద్యోగానంతరమందు తోటపల్లి శాంతి ఆశ్రమమున నివసించి శ్రీ ఓంకార స్వాముల Cosmic flashes ను తెలుగు గీతమున రచించి వారి ఆశీస్సులు పొందిరి! శ్రీ రామచంద్ర ఆధ్యాత్మిక సంఘ సభ్యత్వముతో గురుదేవులను సతీసమేతముగా దర్శించి "భగవత్తత్వము తెలియని మూఢులము బాబూజీ! మీ దివ్యానుగ్రహము చూపి మా దంపతులను తరింపజేయు ప్రార్థింతుము బాబూజీ" అనే మకుటముతో తాము రచించిన ప్రార్థనా గీతమునే వినుచు కనుమూయగలుగుట వారి ఆధ్యాత్మిక మధురానుభూతికి నిదర్శనము! ఈ పద్యభగవద్గీత – అందుకు శాశ్వత సాక్ష్యము! ఈ సత్యములను గ్రంథస్థము చేయు అవకాశము నాకు లభించుట గుర్వానుగ్రహము.

జయ జయ రామకృష్ణ హరే హరే జయ జయ రామకృష్ణ హరే హరే
జయ జయ రామకృష్ణ హరే హరే

ద్వారకామందిరము
శాంతిఆశ్రమము
21.1.1993
ఓంకారస్వామి 99వ జయంతి

మీ విధేయుడు
ముత్యాల సుబ్బారాయుడు

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### మొదటి అధ్యాయము

### అర్జున విషాద యోగము

ధృతరాష్ట్రుఁడు : అనును
ధర్మభూమి కురుక్షేత్ర తలమునందు
యుద్ధమొనరింప సమకూడి యున్న నా కు
మారులును బాండుపుత్రులు కౌరవులయి
యేమి చేసిరి, సంజయా! యెఱుఁగఁజెప్పు ॥ 1

సంజయుఁడు: అనును
అపుడు పాండవ వ్యూఢసైన్యమ్ముఁ జూచి
భారతా! తనగురు డాయఁజేరి, యిట్టు
లనియె దుర్యోధనుఁడు గౌరవాతిశయము
మీఱఁ, బాండవ పక్షమ్ము మేరఁ జూప ॥ 2

పాండు పుత్త్రులయీ గొప్పవాహినిఁ గను
మయ్య, ఆచార్య! ద్రుపదకుమారుఁడతఁడు,
మీకు శిష్యుండు, ధీశాలి, ప్రాకటముగ
వ్యూహముగ నేర్పఱచి యెటు లున్నవాఁడొ? 3

గొప్పవిలుకాండ్రు, శూరులు కూడి రిందు
యుద్ధమున భీమ పార్థతుల్యులుగ వీరు?
అదిగొ యుయుధానుఁడు, విరాటుఁడదిగొ, యతఁడె;
ద్రుపదుఁడాతఁడెన్న మహారథుండు గాదె? 4

చేకితానుఁ డల్ల శిశుపాలుని సుతుండు,
వీరుఁడైన కాశిపృథివినేత,
అతఁడు కుంతి భోజుఁ, డాతఁడే పురుజిత్తు
శిబికుమారుఁడతఁడు శ్రేష్ఠనరుఁడు ॥ 5

ఆయుధామన్యుఁడు గలాఁడె యతుల విక్ర
మమ్ము, వీర్యవంతుఁడె యుత్తమౌజుఁడైన;
ద్రౌపదేయు లదె, సుభద్ర తనయుఁడదిగో,
ఎల్లవారు మహారథులే తలంప ॥ 6

ఓ ద్విజోత్తమ! మనపక్షమున్నవారి
యందున విశిష్టులను గూడ నరసి తెలియు
నాదు సైన్యమ్మునను గలనాయకులగు
వారి, నీదు సంజ్ఞార్థమ్ము పలుకుచుంటి ॥ 7

మీరు, భీష్ముఁడు, కర్ణుండు, పోరిలోన
సతతము జయమ్ముఁగొను కృపాచార్యుఁడదిగో,
ఆవికర్ణుఁ, డశ్వత్థామ తావకీన
ప్రియుసుతుఁడు సౌమదత్తియు, వీరివలెనె ॥ 8

ఇతరులును ననేకులు శూరు లిందుఁగలరు;
నా కయి తెగించినారు ప్రాణములు వీడ;
వివిధ శస్త్ర ప్రహరణముల్ పెక్కు గలిగి,
వీరలెల్లరు యుద్ధ విశారదులుగ ॥ 9

ఆమనలబల మ్ముద్ధి భీష్మాభిరక్షి
తమ్ము, మఱి యపర్యాప్తమ్ము తలచిచూడ;
నైన, ఈ వీరి బలము భీమాభిరక్షి
తమ్ము పర్యాప్తమే యౌను దానియెదుట ॥ 10

అయనముల యందు సకలమ్ము నందుఁగూడఁ
జేరి మీ భాగముల నవస్థితుల రగుచు
శాంతనవునకు మీరు రక్షణ మొసంగు
చంద్రు గావుత మెల్లరు చూపువిడక ॥ 11

అతనికి జనింపఁ జేయుచు హర్ష మాప్ర
తాపవంతుండు వృద్ధపితామహుండు
సింహనాదము బిట్టుగ జేసి యంతఁ
దనదు శంఖమ్ము పూరించెఁదగినరీతి ॥ 12

పిదపను హఠాత్తుగా మ్రోగె బిగ్గరగను
శంఖములు భేరు లాదిగ సకలగోము
ఖమ్ములు పణవానకలును ముమ్మరముగ;
అల్ల శబ్దమ్ము నిండిన వయ్యె దిశలు ॥ 13

ఆ పిదప, శ్వేతహయముల నైన గొప్ప
రథమునందు సుస్థితులై పరంగువారు
మాధవుండును బాండవమధ్యముఁడును
దివ్య శంఖాలు పూరించి, తేజరిలిరి ॥ 14

పాంచజన్యమ్ము నూదె గోపాలమూర్తి,
దేవదత్తమ్ము పూరించె ఆవిజయుఁడు;
పౌండ్రమను మహాశంఖమ్ము పట్టి యూదె
భీమ కర్ముండు భీముండు పృథివి వణక ॥ 15

తనయనంత విజయమును ధర్మరాజు,
కుంతి కొమరుండు, పోర నకుంఠితుండు,
నకుల సహదేవులాదిరి ప్రకటముగను
తమసుఘోషము మణిపుష్పకమును వరుస ॥ 16

విపుల ధనువును గల కాశి పృథివి విభుడు
ఆమహారథుఁడు శిఖండి యనునతండు
ఆవిరాట ధృష్టద్యుమ్న భూవిభుండ్రు
అపజయము నెఱుఁగని సాత్యకియు నూద ॥ 17

ధరణి నాథుండ! ద్రుపదుండు, ద్రౌపదేయు,
లామహాబాహు వభిమన్యుఁ, డెల్లవారు
వేరువేరుగఁ దమతమవివిధశంఖ
ములను బిట్టుగపూరించి రిల కలంగ ॥ 18

ధార్త రాష్ట్రుల హృదయ భేదకమె యగుచు
అట్టి యా ఘోష మప్పుడు వ్యాప్తమయ్యె
భూమియం దంతటను నభమ్మునను గూడ
అంతటఁ బ్రతిధ్వనించుచు ఆ క్షణమ్ము. 19

అటు పయిని, దమస్థానమ్ములందు నున్న
ధార్తరాష్ట్రుల సకల శస్త్రప్రయోగ
మునకు సిద్ధులను గపికేతనుడు చూచి
ఎక్కుడియె యున్నవింటితో పృథుసుతుండు. 20

పలికె, వినహృషీకేశుండు వాక్యమప్పు
డిట్టుల, మహీపతీ! నీకు నెఱుగఁ జెపుదు.
అర్జునుడు : అనును
ఉభయసేనలమధ్యగ నొక్కక్షణము,
అచ్యుతా! నిల్పఁ గదవె నాయరద మిపుడు. 21

యుద్ధమును జేయ సిద్ధమై యున్నవారి,
ఈరణమ్మును దొలుత నేనెవరితోడఁ
జేయవలయునో వారల నీయదనున
నందరిని దేరి చూడంగ నగుదు నేను. 22

ధార్తరాష్ట్రుల దుర్బుద్ధిఁ దప్పనిదగు
ఈరణమ్మున సిద్ధమై యిచట ( గూడు
కొనిన కౌరవుల ప్రియమ్ముఁ గోరువారిఁ
జూడ నొకసారి మదిఁ గోరు వాడ నేను॥ 23

సంజయుడు : అనును
ఈ విధమ్మున ఆ గుడాకేశుఁడనఁగ,
భారతా! హృషీకేశుండు పలుకుతోనె,
యుభయ సైన్యమ్ములకు మధ్య నొక్కచోట
ఆ రథమ్మును స్థాపించి, యచట నున్న॥ 24

భీష్ముఁడును ద్రోణుఁడును నాది పృథివిపతుల
ముందట, నపుడు పలికెను గ్రింది యటుల :
అర్జునా! ఈసమావేశమైనయట్టి
కౌరవుల నెల్లఁ జూడు, మవ్వారె యనుచు. 25

అందుఁ గలవారి గుర్తించె నర్జునుండు;
పితృల, నటు పితామహులను, బేరు గన్న
గురుల, మేనమామలను, సోదరుల, నటులె
పుత్రులను, స్నేహితుల, మఱి పౌత్రుల నాగి॥ 26

శ్వశురులను, సుహృదులెయైనవారి నెల్ల
రెండు సైన్యమ్ములందెందొ నుండువారి,
అందరును బంధువులె యైనయట్టివారిఁ
జూచినపుడర్జునుఁడు, కుంతి సూనుఁడు, మది ॥ 27

పరమకృపను ఆవిష్టుఁడై పరగి యిటులు
పలికె విలపించుచును ఉన్నవాడగుచును
అర్జునుడు : అనును
పోరుటకు సముపస్థితుల్ వీరలెల్ల
స్వజనమౌటను, కృష్ణ! ఏపారఁజూడ, 28

అవయవములు నావి శిథిల మగుచునుండె;
ముఖము కూడను గడునెండిపోవుచుండె;
నా శరీరమ్ము మిగుల వణంకుచుండె;
పులకలును మిక్కిలెక్కువ పుట్టుచుండె ॥ 29

జారు గాండీవ మద్ది హస్తమున నుండి;
అంతట దహించుపోవు దేహమ్ము కూడ;
నిలబడుటకు సమర్థత కలుగదింత;
మనసును భ్రమించునటులే కనబడెడును॥ 30

శకునములును అనర్థదాయకములుగనె
చూచుచునె యుంటి, కేశవా! చూచుకొలఁది,
ఆహవమునందు స్వజనమ్ము హతమొనర్చి,
పిదపనే శ్రేయమును జూచువిధము కనను॥ 31

కృష్ణ! విజయమ్ము నేను గాంక్షింపఁ బోను;
రాజ్యమును గోర, సుఖముల ప్రాప్తినైన;
మనకు రాజ్యమ్ముచే నేమిపని, మహాత్మ?
భోగములనేమి? జీవితమ్మునను నైన? 32

రాజ్యము, సుఖమ్ము, భోగమ్ము ప్రాప్తి కాఁగ
నెవరికయి కోరుచున్నామొ యిపుడు మనము,
ప్రాణధనముల విడచి, యవ్వారె యిచట
యుద్ధమునకు సన్నద్ధులై యున్నవారు॥ 33

గురువులై యున్నవారు, పితరులు, సుతులు,
అట్టులే పితామహులైనయట్టివారు,
మామలును, మేనమామలు, మనుమ, లటులె
బావమరదులు, నల్లె సంబంధులెల్ల. 34

వీరు చంపినఁగూడ, గోవింద! నాకు
ఈ జనమ్మును జంపంగ నిచ్ఛలేదు;
మూడులోకాల రాజ్యమ్ముకూడ వచ్చె
నేని; అట్టిచో, ఈనేల కెట్టులగును? 35

ధార్తరాష్ట్రుల మనము హతమ్ము చేయ,
ఏమిప్రీతి పొసంగెడి కృష్ణ! చెపుమ;
ఆతతాయినులను వీరి హతము చేయ,
మనలఁ బాపమ్మె యాశ్రయించును నిజమ్ము॥ 36

అర్హులము కాముగా మనమందుచేత
ధార్తరాష్ట్రుల మనదు బాంధవులఁ జంప;
స్వజనమునె మన మిచ్ఛించి, చంపునప్పు
డెటుసుఖింపఁగ నయ్యేడు, కృష్ణ! ఇలను? 37

అరయ, లోభోపహతమతు లైన వీరు
కులము నశియింపఁగా నగు ఘోరదోష
మును, హితులయెడ నగు ద్రోహమొనరఁజేయు
పాతకమ్ముఁగనరు, మాధవా! ఒకింత॥ 38

కులము నశియింపఁగా నగు ఘోరదోష
మును విశేషమ్ము తెలిసిన మనము, కృష్ణ!
ఏల తప్పించుకొనఁగ యోజింపరాదొ
తెలియకున్నది, అచ్యుతా! తలఁప నాకు॥ 39

కులము నశియించునేనియుఁ గులపుధర్మ
ములు సనాతనము లదృశ్యములుగ నగును ;
ధర్మము నశింపఁగను సమస్తమ్ము కులముఁ
గప్పివేయు నధర్మమ్ము, తప్పదిద్ది॥ 40

వ్యాప్తిచెంద నధర్మ మాయపుడు, కృష్ణ!
భ్రంశమునకుఁ గులస్త్రీలు పాలగుదురు;
స్త్రీలు భ్రష్టులైనపుడు, వార్ష్ణేయ! పాడు
వర్ణసాంకర్యమద్ది తప్పకయె కల్గు ॥ 41

నరకమునకె యీవర్ణసంకరము కరము
కులమునకును, గులఘ్నులకును దలంప;
లుప్త పిండోదక క్రియులుగను·నగుట,
వీరి పితరులు పతితులై వెతలఁగంద్రు॥ 42

వర్ణసంకరమునకును బాధ్యులైన
ఈకులఘ్నులదోషమ్ము లెన్నిక కయి,
జాతికుల ధర్మముల నెల్ల, శాశ్వతమ్ము
లైనవియె రూపుమాసినవైన వగును ॥ 43

కులము ధర్మమ్ములను భ్రంశములుగఁ జేయు
మానవులకు, జనార్దన! మానఁబోదు
నరకమునయందు నయ్యెడు స్థిరనివాస
మనుచుఁ జెప్పంగ నెప్పుడు వినెదము గద ॥ 44

ఇందు ఏరాజ్యసుఖముల యెడల లోభ
మునను స్వజనమ్మునే చంపగను దలంపా?
ఒక మహాపాపమే చేయఁ, బ్రకటబుద్ధి
మనము నిశ్చయించితిమి; ఏమనఁగ నగును? 45

అప్రతీకారుఁడను, శస్త్రమైన లేని
నన్ను ధార్తరాష్ట్రులె యీ రణమ్మునందు
శస్త్రపాణులై చంపినఁ జంపనిమ్ము;
అదియె క్షేమతరమ్ము నాకు నయి తనర్చు ॥ 46

సంజయుడుః అనును
శోకసంవిగ్న మానసుఁడై కరమ్ము,
ఈవిధము పల్కి, యెడఁ బాసి యెక్కుపెట్టి
యున్న చాపమ్ము, విజయుండు యుద్ధభూమిఁ
జదికిలఁ బడె రథోపస్థపదమునందు 47

ఇటులు
అర్జున విషాదయోగము పూర్తి.

# శ్రీ మద్భగవద్గీత

## తెనుగు గీతములు

### రెండవ అధ్యాయము

### సాంఖ్య యోగము

అపుడు, జాలికి నునికి పట్టై యెసంగి,
అశ్రుపూర్ణాకులేక్షణుఁడై, విచార
మునను మున్గిన యతనితో ననియె నిట్లు,
క్షోణిపా! వాక్య మామధుసూదనుండు॥ 1

శ్రీ భగవానుఁడు :అనును

చాల కశ్మల; మెట్టు లీ సంకటంపు
స్థితి నిను నిటుగ నావరించినది, పార్థ?
ఆర్యులకుఁ బొందఁ దగదు; స్వర్గమ్ము కాదు;
అర్జునా! పెద్ద యపకీర్తికైన దిద్ది॥ 2

పొందఁగను వద్దు మదిఁ గ్లైబ్యమును, కిరీటి!
ఎంతమాత్రమ్ము తగదుచు మ్మిద్ది నీకు;
హృదిని గల క్షుద్ర దౌర్బల్యమది తొలంగ,
నిలువఁ బడుము, పరంతపా! నిలువఁ బడుము॥ 3

అర్జునుడు: అనును

ఎటులు భీష్ముని, ద్రోణుని నేను ఘోర
యుద్ధమున, మధుసూదనా! సిద్ధపడుచు,
బాణములతో నెదుర్కొనఁ బాలుపడుదు?
పూజ్య కరిసూదనా! తగు పుణ్యమతులు॥ 4

గురులను మహానుభావులఁ గూల్పఁబోక,
బిచ్చపుంగూటినే తినఁ బృథివి మేలు;
అర్ధకాముల గురువుల హత మొనర్చి,
యిందె రుధిరార్ద్ర భోగముల్ పొందుకంటె॥ 5

రెండిట నెఱుంగుము మనకు శ్రేష్ఠ మెదియొ;
మనకె విజయమ్మొ? గెల్తురో మనల వారె?
వేరినిం జంపి జీవింపఁగోరఁ బోమొ,
ఎదుట ఆ ధార్తరాష్ట్రులే, అదిగో కలరు॥ 6

చెడెను గార్పణ్యదోషమ్ముచే స్వభావ;
మడుగుదును ధర్మసంమూఢమైన యాత్మ;
ఏది శ్రేయమొ యది నిశ్చయించి చెపుము;
శిష్యుఁడను నేను; శరణు, శిక్షింపు నన్ను॥ 7

అరులు లేని సమృద్ధ రాజ్యమ్ము భూమి,
సురలపై నాధిపత్యమ్ము వరలె నేని
నా సమస్తేంద్రియములు, సంతాప మొందఁ,
గన్నశోక, ముపశమింపఁ, గనను దారి ॥ 8

సంజయుడు : అనును
ఇటు గుడాకేశుఁ డా హృషీకేశుతోడఁ
బలికి, గోవిందుతో ననెఁ బార్థుఁ డంత,
"నేను యుద్ధమ్ముఁ జేయంగ బో" నటంచు;
అని, తనకు జోక్యమే లేని యటుల నుండె ॥ 9

పొంగి పొరలు దుఃఖమ్ముచేఁ బొక్కుచున్న
యతని గూర్చి హృషీకేశుఁడనెను మంద
హాసము నొనర్చునటు, కౌరవావనీశ!
ఆ యుభయ సేనలకు మధ్యయందు నచట॥ 10

శ్రీ భగవానుడు ఃఅనును

చింతిలఁగ రాని వారికై చింతపడెదు;
ప్రాజ్ఞులను బోలి పలికెదు వాదములను;
పరుల కిలఁ బోయెఁ, బోలేదు ప్రాణము లని
చింతిలరు పండితులు భువి నింతగ నెద ॥ 11

"నేను లే" ననునదొకప్పుడేని లేదు;
నీకు నొప్పదే, యొప్ప దీ నృపుల కేని;
దీని పరమందు నుండంగ నైనవార
మందరము కాకపోవుట యదియు లేదు॥ 12

దేహికీ కను పించెడు దేహమందు
బాల్యమును యౌవనము, జర, వరలు ఏటులో
అటులె దేహాంతరప్రాప్తి; అందుచేత,
మోహమును ధీరుఁ డొందంగ బోఁ డొకింత ॥ 13

తలఁప శీతోష్ణ సుఖదుఃఖ దాయకములు
వివిధ మాత్రల స్పర్శముల్, విజయ! తెలియు;
వచ్చుచుండి, పోయెడును, శాశ్వతము కావు;
ఓర్చుకొనఁగదే యవ్వాని, ఓయి పార్థ! 14

సుఖము దుఃఖమ్ము సమముగఁ జూచు ధీరు
నెవ్వనిని, పురుషర్షభా! ఇవ్వియెవియు
వ్యథను గొల్పంగనేరవో యతఁడు కాదె
యగు సమర్థుఁడా యమృతత్వమంద గలుగ॥ 15

అల యసత్తునకును భావమనఁగ లేదు;
సత్తున కభావ మెచటఁ బొసంగఁ బోదు;
తత్త్వదర్శు లీరెంటియంతస్సు నిటులు
చూడఁగలిగినవారైరి కూడ, పార్థ! 16

దేనిచే వ్యాప్త మీ సర్వమైన జగతి
యద్ది యవినాశి, తెలియుమా; అందుచేత,
అవ్యయము; దీని నాశన మవనిఁ జేయ
నెంత మాత్రమర్హుండుకాఁ డేయొకండు॥ 17

నిత్యమై, యప్రమేయమై, నిర్వికార
మగు శరీరికిఁ గలుగు దేహమ్ము లివ్వి
యంతవంతమ్ములని యందు ; రందుచేత,
భారతా! విరమింపకు పోరు; పోరు॥ 18

హంతఁగా దేహిఁ దెలిసెడు నా యతండు,
హతునిగా దేహిఁ దలచెడు నా యతండు,
ఈ యుభయులును జ్ఞాన విహీను లెన్న;
హంతకా దిద్ది; కాఁబోదు హతము కూడ॥ 19

పుట్ట దెన్నఁడు; మఱి, చచ్చిపోవ దిద్ది;
పుట్టి, మఱి, పుట్టబోని దెప్పుడును గాదు;
అజము, శాశ్వతమ్ము, పురాణ, మంతు లేదు;
హన్య మానమ్ము దేహ; మహన్య మాత్మ ॥ 20

అజము, అవినాశనము, నిత్య, మవ్యయమ్ము;
దీని నెవ్వండు, పాండవా! తెలియు, నాతఁ
డెవని జంపింప నేర్చెడు? ఎటుల నేర్చు?
ఎవనిఁ జంపంగ జాలు? ఎటులు చాలు? 21

చినిగినట్టి బట్టలు విడచిన నరుండు
స్వీకరించెడుఁ గ్రొత్తవి వేఱుగ నెటు,
లటులె, జీర్ణశరీరమ్ము లవల విడచి,
యితరములను గ్రొత్తవి ధరియించు దేహి ॥ 22

శస్త్రములు దీని భేదింపఁజాల వెవియు;
పావకుఁడు దీని దహియింప వలను పడదు;
అంబువులు దీనిఁ దడుపంగ నలవి కాదు;
మారుతము దీని నెండింపనేర దెటుల॥ 23

ఇద్ది యచ్ఛేద్యము; అదాహ్య మిద్ది యటులె;
అటులె యక్లేద్యము; అశోష్యమైనదియును;
సర్వగతమును; నిత్యమ్ము; స్థాణు; వచల;
మియ్యది సనాతనమ్మయి యెసఁగుఁ గూడ॥ 24

ఇద్ది యవ్యక్తము; అచిన్త్య మిద్ది యనియు,
ఇద్ది యవికార్య, మని చెప్పి రింత దనుక;
అందుచే, నిటు తెలిసియు నైన దీని,
నీకుఁ దగదుసూ యేపాటి శోకమొంద॥ 25

మఱియు, నొకవేళ నియ్యది మఱల మఱలఁ
బుట్టి గిట్టున దని తలంపున్నదేమొ,
అప్పటికిని, మహాబాహు! ఇప్పటులులు
నీకుఁ దగదుసూ యీ రీతి శోక మొంద॥ 26

ఏలనఁగఁ, బుట్టినద్దాని మృతి ధ్రువమ్ము;
చచ్చిన ద్దానికి ధ్రువమ్ము జన్మ మటులె;
అందుచేతనె, యపరిహార్యార్థ మిపుడు
నీకుఁ దగదుసూ యే మాత్ర శోక మొంద॥ 27

మొదలు లవ్యక్తములు సర్వభూతములకు;
భారతా! వాని మధ్యముల్ వ్యక్తము లగు;
వానినిధనమ్ము లవియు నవ్యక్తములుగ;
అట్టి తఱిఁ బరిదేవన కవసరమెది? 28

ఒకఁడు కను దీని వింతతో నొకటిగ నయి;
వింతతోఁ బల్కు నట్టులే వేఱొకండు;
వింతతో దీని గూర్చియే విను మఱొకఁడు;
దీని వినియు నొకండును దెలియఁడు గద ॥ 29

ఎల్ల దేహమ్ములందలి యీ శరీరి,
భారతా! నిత్యమగును నవధ్య మగుచు;
అందుచే, సర్వభూతాల నాత్మ నిలిపి,
నీకుఁ దగదుసూ యెటువంటి శోకముఁగన॥ 30

అదియుఁ గాక, స్వధర్మమ్ము నందుఁ జూపు
కలిగినను, నీవు తగవు వికంప మొంద;
ధర్మయుద్ధమ్ము కంటె నితర మొకండు
తెలియదుగ శ్రేయమగుచు క్షత్రియున కిందు॥ 31

కోరకయె సంభవించె, అయారె! ఇద్ది;
తెఅచియున్న స్వర్గద్వార మరయ నిద్ది;
ఇట్టి యుద్ధమ్ము తమకు లభించినట్టి
క్షత్రియు లదృష్టవంతులు ధాత్రి, పార్థ! 32

కాని, చేయవో ధర్మసంగ్రామ మిద్ది,
ఈ వొకానొక కారణ మేదొకలిగి,
అపుడు, వీడి స్వధర్మమ్ము, అపయశస్సు
పొలయి, అనుభవించెదు పాపఫలము॥ 33

అంతియే కాదు; భూతమ్ము లవ్యయమగు
నీ యపయశస్సుఁ గథలుగనే పఠించు;
అవని సంభావితున కగు నపయశస్సు
మరణమునకంటె నెక్కువై పరగు మఱియు॥ 34

ఏ మహారథులకు నీవె యెక్కువ యయి
లాఘవము పొందుదో, వారలాత్మఁ దలఁప
నగు రణమ్మున నుండి భయమ్ము చేత
నీవు వెనుకకు నిటు తగ్గినా వటంచు ॥ 35

నీదు సామర్థ్యమును గూర్చి నింద మోపి,
ఎక్కువగ నవాచ్యమ్ముల నెన్నొయాడఁ
గలరు నీయహితమె కోరఁదలుఁచువార;
లంతకంటె దుఃఖతర మేదైన గలదె? 36

స్వర్గము లభించుఁ బోరిలోఁ జంపఁబడిన;
గెలిచెదో, పొందెదవు మహి; కలుగు మేలె;
అందుచేతను, గృతనిశ్చయమ్ముతోడ,
లెమ్ము, కౌన్తేయ! నేటి యుద్ధమ్ము చేయ ॥ 37

సమముగను నెంచి సుఖము దుఃఖమును రెంటి,
జయము నపజయమ్మును రెంటి; సకల లాభ
నష్టములఁ గూడఁ; బిదప నిర్ణయము చేయు;
యుద్ధ మిట్లైన, నేపాప మొందవీవు ॥ 38

ఇంతకును సాంఖ్యబుద్ధి నీ కిటులు చెప్పఁ
బడెను; పయి, యోగమునుగూడఁ బలుక, వినుము;
ఎట్టి బుద్ధి యుక్తుండవై యావు, పార్థ!
కర్మ బంధమ్ము విడనాడఁగలుగ నగునొ॥ 39

ఇందు లేదు చేయు కృషి కెట్టిహానియేన్
ప్రత్యవాయ మేది ప్రాప్తి కాదు;
అరసిచూడ, స్వల్పమగుఁగాక, యీధర్మ
మెట్టి భయము నుండి యేని కాచు॥ 40

ఈ పథమ్మునందు నేకమ్ము నిశ్చయ
రూప బుద్ధి, పార్థ! రూఢి యిద్ది;
హద్దు లేదు, పెక్కు, లవ్యవసాయాత్ము
లైనవారి బుద్ధు లరసిచూడ॥ 41

దీని మించి లేదనుచు వాదించువారు
వేదవాదరతులు, అవివేకమతులు,
కుసుమ కోమల వాక్కులఁ గోరి కోరి,
పార్థ! ఏమి యే మనుచును బలుకుదు రన ॥ 42

భోగమైశ్వర్యమును దాము పొందు సాధ
నములును గ్రియా విశేషమ్ము లమితముగను
గర్మఫలముగ జన్మయే కలుగఁజేయు
నందు రాస్వర్గ సుఖముల ప్రాప్తిఁ గోరి॥ 43

దాన, అపహృత చేతస్కులైన భోగ
పరులకు, నరుల, కైశ్వర్యవాంఛకులకుఁ
బొసఁగు నొక్కొ నిశ్చయరూప బుద్ధి యను స
మాధి మనసులు సంసక్తమైన వాట? 44

విజయ! త్రైగుణ్య విషయముల్ వేదము లన;
త్రిగుణములకు నతీతుండ వగుము నీవు;
ద్వంద్వములు లేక, నిత్య సత్త్వస్థుఁడ వయి,
యోగమును క్షేమమును లేక యుండు చుండి,
యాత్మవంతుడ వగుము నీ వనవరతము॥ 45

అంతటను నీరు సంప్లుతమైన యెడల
ఏ ప్రయోజన ముదపాన మిడఁగ గల్గు!
జ్ఞాని యగు బ్రాహ్మణునకును సర్వవేద
ములు నొసంగు నంతయె లాభమును గొనంగ॥ 46

కర్మమునయందె నీయధికార మెల్ల;
ఫలమున నొకప్పుడైనను గలుగ దద్ది;
కర్మఫల హేతు వెన్నండు కావు నీవు;
చెందకుమ సంగము, అకర్మమందు నీవు ॥ 47

సిద్ధ్యసిద్ధుల సమతతో స్వీకరించి,
సంగము త్యజించి, చేయుమా సకల కర్మ
ములను యోగస్థుఁడవయి యెప్పుడును, పార్థ!
యోగమని, సమతనె యంద్రు యోగి వరులు ॥ 48

అవరము సుదూరమును గదా యఖిల కర్మ
బుద్ధి యోగమ్ము తోడను బోల్చి చూడ;
బుద్ధియోగాశ్రయమ్మునే పొందఁ గోరు;
ఏ ఫలముఁగోరినను నరుల్ కృపణులు గద ॥ 49

సుకృత దుష్కృతద్వయ మిందె యొకట వీడి,
తొలఁగనవి, యెప్పు బుద్ధి యుక్తుఁడు, పార్థ!
అందుచేఁ బ్రయత్నింపు యోగార్థమీవు;
కర్మలెడఁ గౌశలమ్మె యోగమ్మనంగ॥ 50

బుద్ధియుక్తులై, కర్మలఁ బుట్టు ఫలము
విడచిన మనీషులు తమదు వివిధ జన్మ
బంధ నిర్ముక్తు లౌచును, పాండవేయ!
పొందుదు రనామయ మ్మగు మూలపదము॥ 51

ఎపుడు మోహకాలుష్యమ్ము నెల్ల నీదు
బుద్ధి దాటంగ గల్గునో పూర్తిగ నాగి,
అందనగు నీకు నిశ్చింత మపుడు, వినఁగఁ
దగిన దాని గూర్చియు, విన్నదాని గూర్చి॥ 52

వినుటచేత విప్రతిపత్తి మునిగియున్న
నీదు బుద్ధి, సమాధిని నిశ్చలమయి,
యచల మయి, స్థిరపడనెపు డౌనొ యపుడు
యోగసంసిద్ధిఁ బడయ నర్జుండ వగుదు॥ 53

అర్జునుడు :అనును
అలసమాధి నున్నయట్టి స్థితప్రజ్ఞు
భాష యెట్టి భాష, పరమ పురుష!
ఎటులు మాటలాడు, ఈ స్థిత ప్రజ్ఞుండు?
ఎటులు కూరుచుండు? ఎటులు నడచు? 54

శ్రీ భగవానుడు :అనును
ఎప్పుడు మనోగతము లెల్లస్పృహలు విడచి,
యాత్మయందునె సంతుష్టి నాత్మ చెందఁ
గలుగ నేర్చునా పూర్తిగ నిలను, పార్థ!
అప్పుడు సుమీ స్థితప్రజ్ఞుడందు రతని ॥ 55

కలత చెందదు మనసు, దుఃఖములు కలుగ;
సుఖము లినను స్పృహ పొడచూపఁ బోదు;
వీతరాగ భయ క్రోధుఁ డాతఁడెపుడు;
మనన శీలి, స్థితప్రజ్ఞుఁ డనగ నొప్పు॥ 56

సర్వమున యందు సమత నిస్సంగుఁ డెవడొ,
ప్రాప్తమగునట్టి యాయా శుభాశుభాలు
పొందియును మోదఖేదముల్ పొంద డెవఁడొ,
యతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై తనర్చు ॥ 57

అంగముల నన్నిఁటిని గూర్మమటులె యాతఁ
డెప్పు డుపసంహరించునో యింద్రియముల
విషయముల నుండి, యప్పుడు విజ్ఞులందు
రతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై తనర్చు ॥ 58

అల నిరాహార దేహివి యైన విషయ
ములు రసమ్ము విడచియె మఱలుచును జను;
రసము కూడను, నితఁడు పరమ్ముఁ గనిన
పిదప సంపూర్ణముగను నివృత్తిఁ జెందు ॥ 59

యత్నమును జేసెడు విపశ్చితాత్ముఁడైన
పురుషునిం గూడ నింద్రియాల్ ముంచుఁ గలఁత
సహజముగఁ గాదె, కౌన్తేయ! శంకలేక,
మనసును హఠాత్తుగ హరించు మహిమ చేత ‖ 60

అన్నిఁటిని వీని నదుపున నడ్డి, నన్ను
ధ్యాన మొనరింపు యుక్తుండవై సభక్తి
వేని యింద్రియములు వశమౌనొ యట్టి
యతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై తనర్చు ‖ 61

విషయములమీది ధ్యాసచే వీని యెడలఁ
బురుషునకు సంగమభివృద్ధి పొందు సుమ్మ;
సంగముననుండి కామమ్ము సంజనించుఁ ;
గామమునఁ బుట్టుఁ గ్రోధమ్ము క్రమము విడక ‖ 62

అపుడు, మోహమ్ము క్రోధమ్ము నంటి వచ్చు;
దానివెన్క స్మృతి భ్రంశమౌ; నిజమ్ము;
స్మృతి చెడినయంత బుద్ధి నశించును గద;
బుద్ధియె నశింప, గల సర్వమును నశించు‖ 63

కాని, లోఁబడు నంతరంగమ్ము కలుగ,
వశములై, యింద్రియమ్ములు వఱలి, రాగ
మేని, ద్వేషమేనియు లేక యెసఁగి, విషయ
ములను బొందుచును, బ్రసాదమున మునుంగు ‖ 64

సర్వదుఃఖమ్ము లితని ప్రసాదమునను
హాని చెందెడును దలంప; నల ప్రసన్న
చేతసుని బుద్ధి తడయక శీఘ్రముగనె
నిశ్చల మగు భావమ్ముఁ జెందెడును గాదె ॥ 65

యోగయుక్తుండు గాకున్న నుండుటెట్లు
బుద్ధియే కాని, భావనా బుద్ధికాని?
శాంతి యెటులబ్బు భావనా శక్తి లేక?
శాంతిహీనున కెటులుండు శాంతి సుఖము? 66

ఇంద్రియమ్ముల వెనువెంట నెవని చిత్త
మనుగమించునో నిలకడ కనఁగ లేక,
యతని ప్రజ్ఞ నశించు, సత్యమ్ము కాదె?
అంబుధిని నావ పెనుగాలి నటులు కాగ॥ 67

అందున, నెవండు తన యింద్రియముల వాని
విషయములనుండియు సమస్త విధాల
నిగ్రహించు, మహాబాహు! నేర్పుతోడ,
అతని ప్రజ్ఞ ప్రతిష్ఠితమై తనర్చు ॥ 68

ఎల్లభూతమ్ములకు రేయి యేదొ, దాని
యందె మేల్కొను సంయమియైన యతఁడు;
మేలుకొనియుండు భూతాల జాల మెప్పు
డదియ రాత్రిగఁ గను మునియైన యతఁడు ॥ 69

అంతటను నిండి, స్థిరమయి, యచలమైన
యంబుధి జలమ్ములు ప్రవేశ మయ్యెడు నెటు,
లటు సమస్త కామమ్ము లేయతనిఁ జేరుఁ,
గను నతఁడు శాంతిఁ; గనలేడు కామ కామి ॥ 70

ఎవడు కోరిక లన్నింటి నెల్ల విడచి,
"ఏను, నాది" యు లేని నిస్పృహను మెలగి,
పురుషుఁడు చరించు నో కర్మముల నొనర్చు,
చతఁడు శాంతిని బూర్తిగ నంద గలఁడు ॥ 71

ఇద్దియే సుమ్ము, పార్థ! బ్రాహ్మిస్థితి యన;
పొంది దీనిని, విడచెడు మోహ మెల్ల;
ప్రాణమును బాయుచో, దీని యందె యున్నఁ,
బడయు ముక్తిని, బ్రహ్మనిర్వాణ మొందు ॥ 72

ఇటులు
సాంఖ్యయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### మూడవ అధ్యాయము
### కర్మయోగము

అర్జునుడు :అనును
కర్మకంటె బుద్ధి ఘనమంచు నీ మత
మైనయప్పుడేల, అప్రమేయ !
ఘోరకర్మ చేయఁ గోరి నియోగించి
తేల నన్ను నీవు, కృష్ణదేవ ! 1

పలికి సందిగ్ధములు వోలె వాక్కు లీవు
బుద్ధిని మఱింత చలియింపఁ బూను దొక్కొ?
దేనిచే శ్రేయమును బొంద నౌనొ నేను
దానినే పల్కుమది నిశ్చితమ్ముగనర్చ ॥ 2

శ్రీ భగవానుఁడు: అనును
విజయ! ఈ లోకమున నిష్ఠ ద్వివిధమగును,
అపుడు నాచేతఁ బ్రోక్తమ్ము లైన యటులు
జ్ఞానమనెడి యోగమ్మును సాంఖ్యులకును,
యోగులకు నైన, అలకర్మయోగమనియు ॥ 3

కర్మలోనికి దిగకయే కర్మనుండి
మోక్షమును బొందనేరండు పురుషుఁడెపుడు;
మఱియుఁ, గర్మమును త్యజించు మాత్రముననె
పొంద సాధ్యమ్ము కాదు సంపూర్ణ సిద్ధి॥ 4

ఎవఁడు నెన్నఁడు నొకక్షణమ్మేనినుండ
నేరఁడు గదా యొనర్పఁ బనేమి లేక;
అవశమయి సర్వమును గర్మ నాచరించుఁ
బ్రకృతి జన్యగుణమ్ముల ప్రాభవమున ॥ 5

ఎవఁడు నియమించుఁ దనదు కర్మేంద్రియముల
మదిఁదలంచుచుఁ గూర్చుండి, మఱల మఱల,
విషయములను విమూఢాత్మవృత్తి చేత,
నతని నిందు మిథ్యాచారుఁడందురు గద ॥ 6

కాని, మది కింద్రియములు స్వాధీన మగుడు
కర్మయోగమ్ము నాగి నసక్తతను జేయఁ
దనదు కర్మేంద్రియమ్ము లెతండు నేర్పు,
అర్జునా! విశిష్టుఁ డతండె యగును జుమ్ము ॥ 7

నీవు, కౌన్తేయ! చేయుమా, నియత కర్మ;
కర్మ శ్రేష్ఠమ్ముకాదె యకర్మకంటె?
అల శరీర యాత్రయును సాధ్యమ్ము కాదు
గాదె కర్మమ్ము విరమింపఁగను దలంప ? 8

యజ్ఞమున కగు కర్మ కన్యత్రమైన
కర్మ, బంధనము నరలోకమున నగును;
సంగ రహితుఁడవగుచు లెస్సగను జేయు
కర్మము తదర్థ మఖిలమ్ము కార్యములను ॥ 9

యజ్ఞములతోఁ బ్రజాపతి యాదియందుఁ
బ్రజల సృష్టించి, యనె నిట్లు వారితోడ;
"దీనిచేఁ జెందుఁడీరు వృద్ధిని సతమ్ము ;
ఇష్ట కామమ్ము లిడుగాత మిద్దిమీకు ॥ 10

దీనిచే వృద్ధిఁ గూర్పుడు దేవతలకు;
దేవతల, వృద్ధి నిడనిండు తిరిగి మీకు;
ఇట్టులు పరస్పరమ్మును వృద్ధి నెనసి,
పరమ శ్రేయస్సు నుభయులుఁ బడయ వచ్చు" ॥ 11

యజ్ఞ భావిత దేవత లందఁ జేయు
నిష్ట భోగమ్ములవి తృప్తి నిడును గాదె ?
వారొసంగిన భోగముల్ వారి కిడక
యెవఁడనుభవించు, దొంగకాకెవఁ డతండు ॥ 12

యజ్ఞ శిష్టాశినులనఁ, బుణ్యాత్ములు సుమి ;
సకల పాపాలనుండి మోక్షమ్ముఁ గంద్రు;
ఆత్మకయి వండు కొనుచుండు నట్టివారు
పాపమునె భుజియించెడు పాతకుండ్రు ॥ 13

పుట్టుఁగద అన్నముననుండి భూతవితతి;
వర్షముననుండి అన్నముద్భవము చెందు;
యజ్ఞముననుండి వర్షమ్ము ప్రాప్తమగును;
కర్మముననుండి యజ్ఞమ్ము కనును రూపు ॥ 14

బ్రహ్మమునఁ బుట్టుఁ దెలియు, కర్మమ్ము, నిజము;
అక్షర సముద్భవమ్ము బ్రహ్మమ్మనంగ ;
అందుచే, సర్వగతము బ్రహ్మమ్ము; మఱియు,
యజ్ఞమునఁ బ్రతిష్ఠితము నిత్యమ్ము బ్రహ్మ ॥ 15

ఈ విధము ప్రవర్తితమైన యిట్టి చక్ర
మెవ్వఁ డనుసరింపండొకో యిహమునందు,
ఆ విషయ లోలుఁడెన్న, అఘాయువు సుమి;
ఆతని జీవనమును వ్యర్థ మౌను, పార్థ ! 16

అయిన, నరుల యందెవ్వని కాత్మనె రతి,
ఆత్మనే తృప్తి, సంతుష్టి యాత్మయందు
నే యగుచు నుండునో, వాని కెందుఁగాని
కార్యమనునది,యే యొండుఁ గానరాదు ॥ 17

అట్టిడున కిందుఁ జేసి, చేయకయుఁ గాని
అర్థమో, ప్రత్యవాయమో యైన లేవు;
ఇతనికి సమస్త జీవుల నేయొకండు
నాశ్రయించెడు నవసరమైన లేదు ॥ 18

అందుచే, అసక్తత నెల్లయప్పుడీవు
కార్యమగు కర్మమును లెస్సగా నొనర్పు;
కర్మము నసక్తుఁడై చేయఁగలుగునేని,
పురుషుఁడు పరమ్ముఁ దేలికఁ బొందును గద ॥ 19

కర్మముననె ప్రవర్తించి కాదె జనకుఁ
డాది కాఁగ సిద్ధిని బడయంగనైరి?
లోకసంగ్రహ మాత్ర మాలోచనమ్ము
చేసినను గర్మమును నీవు చేయఁదగును ‖ 20

శ్రేష్ఠుఁడే యట్టి కర్మమ్ము చేయుచుండు
నట్టి దట్టిదె యొరుఁడును నాచరించు;
ఏయది ప్రమాణ మాతండు చేయు, నదియె
అనుసరించును లోకమ్ము నతనిఁ జూచి ‖ 21

నాకుఁ గర్తవ్యము త్రిభువనముల లేదు,
అర్జునా! కొంచెమేనియు నాత్మనెన్న;
పొందఁబడకుండ లేదునేఁ బొందఁ దగిన;
దయిన, వర్తించుచునె యుంటి నఖిల కర్మ ‖ 22

ఒకపుడేనినే నలయకయుండి, కర్మ
మునఁ బ్రవర్తింపకుంటినా, అనఘ! అపుడు
మనుజులందరు నిల నాదు మార్గముననె
అన్నివిధముల వర్తింతు, రౌను గాదె? 23

కర్మమును నేను జేయుట కలుగదేని,
లోపమును జెందెడు సమస్త లోకములును;
కర్త నగుదును వర్ణసంకరమునకును
పాడుచేసిన వాఁడనై ప్రజల వీరి ‖ 24

సక్తులగు నవిద్వాంసు లేసరణిఁ గర్మ
ముల నొనర్తురో యవ్విధిఁ బోలి, పార్థ!
అటులె విద్వాంసుఁడు నసక్తుఁడగుచు, లోక
సంగ్రహేచ్ఛను గర్మముల్ సలుప నగును ॥ 25

బుద్ధిభేదమ్ముఁ గలిగింపఁ బోలదెటులఁ
గర్మసంగులైయున్న యజ్ఞానులందు;
యుక్తవిద్వాంసుఁడు తన సముచిత రీతిఁ
జేయు, చితరులఁ బ్రేరణ చేయనగును ॥ 26

ప్రకృతి గుణములచేతఁ గర్మములు చేయఁ
బడుచు నున్నవి యిందు సర్వమ్ముగతుల;
అహముచే విమూఢుండైన యతఁడు, "నేనె
కర్త"నని తలపోసినఁగాని మదిని ॥ 27

కాని, గుణకర్మముల విభాగమ్ము, తత్త్వ,
మెఱుగు నా జ్ఞాని సక్తత నెపుడు కనఁడు
గుణముల గుణాలె మసలు, నింకొండు కా ద
టంచు, ఓ మహాబాహు! నిజాత్మఁ దెలిసి ॥ 28

ప్రకృతి గుణముల మూఢులై పఱగువారు
గుణములను గర్మములను సక్తులుగ నుంద్రు;
ఆయకృత్స్నవిధుల, నట్టి స్వల్పమతుల
కృత్స్నవిత్తు చలింపంగ నెంచరాదు ॥ 29

కర్మముల నెల్ల నాయందుఁ గలియునట్లు
సంన్యసించి, అధ్యాత్మ సుస్వాంతముననుు,
నిర్మముఁడవై, నిరాశివై, నెగడి, నీవు
సలుపుమా పోరు వీడిన జ్వరుఁడ వగుచు ॥ 30

ఎవరు మానవులందు నా యీమతమ్ము
శ్రద్ధతో, ననసూయతో, సంతతమ్ము
అనుసరింతురో కర్మచేయంగఁ బూని,
కర్మనుండి, వారేని మోక్షమును గాంత్రు ॥ 31

ఐన, ఈ నా మతమ్మెవ్వ రనుసరింప
రో అసూయకు లోనయి, ఓయి పార్థ!
వారు జ్ఞాన విమూఢులు పలువిధాల,
మతి విహీనులు, తెలియుమా, పతితులుగను ॥ 32

స్వీయ ప్రకృతికి ననుగుణ చేష్టలగుచు
వ్యవహరించెడు, జ్ఞాని యౌవాఁడు కూడ;
భూతములు స్వీయ ప్రకృతినే పొందుచుండు;
నిగ్రహమ్మేమి చేయంగ నేర్చుఁ దలఁప ॥ 33

ద్వేషమును రాగమును సంభవించుచుండు
విషయములు నింద్రియమ్ములు వీని మధ్య;
వాని వశమునందునఁ జిక్కుపడగరాదు;
ఎందుకా? అవ్వి వీరికి నెల్ల యరులు ॥ 34

విగుణమేని స్వధర్మమ్ము మిగుల మేలె,
ఒరుని ధర్మమ్ము లెస్స చేయుటను మించి;
స్వీయ ధర్మమ్ముచే మృతి శ్రేయ మిడును,
అన్య ధర్మమ్ము తలఁప భయావహమ్ము ॥ 35

అర్జునుఁడు : అనును
ఐన, దేనిచేతఁ బ్రయుక్తుఁడై యఘమ్ము
నాచరించు, ఈ పురుషుఁ, డో యవ్యయాత్మ!
తాను కోరకయుండినసైనఁగాని,
బలముతో నియోగింపంగఁ బడినయట్లు ॥ 36

శ్రీ భగవానుడు : అనును
ఇదిగొ, కామమ్ము; క్రోధమ్ము, నిదిగొ; చూడు;
ద్వయమును రజోగుణ సముద్భవములు సుమ్ము;
తృష్ణ తీరదు; దుర్మార్గమెంత యెచ్చొ?
ఇదియె యిహమున శత్రువం చెఱుగు మీవు. 37

అగ్ని నేరీతిగను బొగ యావరించు?
అద్దమును నెట్లు మాలిన్య మావరించు?
అల్లశిశువును నెటు మావి యావరించు?
అటులె యిదియును దీనిచే నావృతమ్ము ॥ 38

దీనిచే నావృతమ్మౌను జ్ఞానమిందు,
జ్ఞానులకు నిత్యశత్రువౌ దానిచేత,
అగ్నినిం బోలెఁ బూరింప నలవి కాని
దానిచేతఁ, గామమ్ముచేఁ, దలఁప, పార్థ ! 39

ఇంద్రియములు మనోబుద్ధు లెల్ల దీని
కాశ్రయములంచు, అర్జునా! అనెదరు గద;
వీనిచే జ్ఞానమును గప్పి, లోని యాత్మ
నిద్ది మోహమ్మునను ముంచి, యెగ్గుఁ గూర్చు ॥ 40

అందుచే, నీవు తొలు దొల్త నఖిలమైన
యింద్రియమ్ముల నియమింపుమెలమి, పార్థ !
జ్ఞాన విజ్ఞానములను నాశనము చేయు
నీ మహాపాపిఁ, జూడు నశించునట్లు ॥ 41

ఇంద్రియమ్ములు పరమనియెదరు గాదె;
ఇంద్రియములకుఁ బరమనియెదరు మనసు;
మనసునకుఁ గూడఁ బర మంద్రు మహిని బుద్ధి;
బుద్ధికిని బరమ్మయ్యది, పూజితాత్మ! 42

ఓ మహాబాహు! అవ్వల నున్నదానిఁ
దెలియు, మాత్మను నాత్మచేఁ దెలిసి స్థిరత,
లోఁబడనిదాని, ఈ కామరూపవైరి,
నాశనము చేయు, నీ యధీనమ్ము చేసి ॥ 43

ఇటులు
కర్మయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### నాల్గవ అధ్యాయము – జ్ఞాన యోగము

శ్రీ భగవానుడు :అనును

అవ్యయమ్మైన యీ యోగ మపుడు నేను
పల్కియున్నాను బూర్తి వివస్వతునకు;
మనువునకు వివస్వతుఁడు చెప్పిన యతండు;
మనువొ, ఇక్ష్వాకునకును దెల్పెను గ్రమాన ॥ 1

ఇటులను పరంపరాప్రాప్త మిద్ది; దీని
రాజఋషివరుల్ తెలిపెడి ప్రాజ్ఞులెరి;
అట్టియోగ మిచ్చట నష్టమయ్యెఁ జాల
కాలమేగంగ, నేగంగగా, కిరీటి ! 2

ఆ పురాతన యోగమే యరయ నేను
నీకు నిపుడుపదేశింప నిట్టులయ్యె,
భక్తుఁడవు నాకు సఖుఁడవు పరగ నీవ
యనుచు, నుత్తమమైన రహస్యమనుచు ॥ 3

అర్జునుడు :అనును
అపరమునయందు జన్మ నీయది యిదౌను;
పరమున వివస్వతుని జన్మమరయ నెపుడొ?
దీని నాదిని నీ వుపదేశముగను
బలికి తంచును నేనెట్లు తెలియ నగును ? 4

శ్రీ భగవానుడు ఇట్లనును
నాకు నీకు ననేక జన్మములు గడచి
పోయినవి యిప్పటికి నిందు, పురుష వృషభ!
వాని నన్నింటి నెఱుగుదు నేను; గాని,
తెలిసి కొనఁజాల వీవు, కౌన్తేయ! తలఁప ॥ 5

అజుఁడ నవ్యయాత్ముండ నేనైనఁగూడ,
అఖిల భూతాలకుఁ బ్రభుండ నైనఁ గూడ,
నాదు ప్రకృతిని నా యధీనమ్మొనర్చి,
ఆత్మమాయచే ఈ నేనె వ్యక్తమగుదు ॥ 6

ఎపుడెపుడు ధర్మమునకు ఘటించు గ్లాని,
మఱి, అధర్మమభ్యుత్థాన మగుచునుండు
ఆ సమయముల యందు, ఓ యర్జునుండ !
ఏన, నన్ను నేనే, కోరి సృష్టించుకొందు ॥ 7

సాధులకుఁ బరిత్రాణ మొసంగుట కయి,
దుష్కృతుల, నాశమొనరించి తొలఁగఁజేయ,
ధర్మముల పునస్స్థాపనార్థమ్ము, పార్థ !
యుగయుగమ్మున నవతార మొందుచుందు ॥ 8

నావి దివ్యమ్ములగును జన్మమ్ము, కర్మ;
దీని తత్త్వమ్ము నెవ్వండు తెలియు నతఁడు,
తొలఁగ దేహమ్ము, మఱు జన్మ తెలియఁబోడు,
అర్జునా! నన్నునే పొందు నాయతండు ॥ 9

వీతరాగ భయక్రోధులై తనర్చి,
ఆశ్రయము నేను కాఁగ, నాయందు లీన
మై, పవిత్రులై, జ్ఞానతపాఢ్యులౌటఁ,
బొందినారలు నాభావమును గతాన ॥ 10

ఎవరు దేనికై, నను భజియించువారో
వారల ననుగ్రహింతు ఆఫలమె యొసఁగి;
అర్జున! మనుష్యులెల్లరు నన్ని గతుల,
అనుసరింతురు నామార్గ మద్ది యొకటె ॥ 11

కర్మసిద్ధిని మదియందుఁ గాంక్షచేసి,
ఇహమున యజింత్రు దేవతానేకములను;
కర్మల ఫలాలు నరులలోకమ్మునందుఁ
ద్వరితముగ సిద్ధిఁగనఁ బరిపాటి గాదె? 12

గుణము కర్మల భాగాల కొలఁది నేను
వర్ణములు నాల్గు వరుస నేర్పఱచి యుంటి;
వాని కర్త నౌచును నేను వఱలుచున్నఁ,
గను, మకర్తయు, నవ్యయుం డనుచు నన్ను ॥ 13

అంటుకొన లేదు కర్మమేదైన నన్ను;
కర్మఫలమందు స్పృహ నాకుఁ గలుగఁ బోదు,
అని యెతఁడు నన్ను దెలియునో యాతఁడెపుడు
కర్మములచేత నిసుమంత కట్టుబడడు॥ 14

దీనిఁ దెలిసి, ముముక్షువుల్ దీని పూర్వ
మునను గూడఁ గర్మనుఁ జేయఁ గనినవారు ;
అందుచే, నీవు కూడ నీ ముందు, దాని
పూర్వమునఁ, జేసినటు, కర్మఁ బొనరుపఁగదె ॥ 15

కర్మమన నేదియొ? మఱి, యకర్మ మేదొ?
పండితులు దీన వ్యామోహ పడినవారె;
దేనిఁ దెలిసి, పాపమునుండి తేఱఁ గలవొ
అట్టి కర్మ నీకిదె తెలియంగఁ జెపుదు ॥ 16

అరయ బోద్ధవ్య మగుఁ గర్మమనఁగ నేమొ;
అరయ బోద్ధవ్యము వికర్మ మనఁగ నేమొ;
అరయ బోద్ధవ్యమె అకర్మ మనఁగ నేమొ;
కర్మమార్గమ్ము లేమైన గహనము గద ॥ 17

కర్మమందె యకర్మను గనెడు నెతఁడు,
కర్మమె యకర్మయందునే కనెడు నెతఁడు,
మనుజు లందఱిలో బుద్ధిమంతుఁడతఁడు ;
అతఁడు యుక్తుండు; కర్మకృత్తన్నిటందు ॥ 18

ఎతని సర్వసమారంభవితతి, సర్వ
కామ సంకల్పవర్జిత మీ మహినగు,
నతని, జ్ఞానాగ్ని దగ్ధ కర్మాత్మునిగను,
బండితునిగను, బుధులెల్ల పలుకుచుంద్రు ॥ 19

కర్మ ఫల సంగమద్ది లేకయె తనర్చి,
ఆశ్రయము లేక, తృప్తి నిత్యమ్ము తనరఁ,
కర్మల నభిప్రవృత్తిని గలిగి కూడ,
అతఁడు కించిత్తుఁ జేయనియతఁడె యౌను ॥ 20

ఆశలను వీడి, నియత చిత్తాత్ముఁడగుచు;
త్యక్త సర్వపరిగ్రహుండగుచుఁ, గేవ
లమును శారీరకపుఁ గర్మమును జేసె
నేని, కిల్బిషమ్మును బొందనేరఁ డతఁడు ॥ 21

ఇచ్ఛ చేయని లాభమ్ము తృప్తి నొసఁగ,
ద్వంద్వముల కందకయె విమత్సరుఁడ యగుచు,
సిద్ధ్యసిద్ధులు సమ మౌచుఁ జెలఁగు నేని,
కర్మ చేసియు బద్ధుండు కాఁ డొకింత ॥ 22

సంగము గలించి, ముక్తుఁడై సర్వవిధుల
జ్ఞాని యయి, స్థిరమగు చేతసమ్ము వెలయ,
యజ్ఞముల కయి మాత్రమే యాచరించు
నతని కర్మలు నశియించు నన్నిగతుల ॥ 23

అర్పణము, బ్రహ్మమే యగు; హవిసు, బ్రహ్మ;
బ్రహ్మ, మగ్ని; ఆహుతమును బ్రహ్మమగును;
అతని గంతవ్య, మదియు బ్రహ్మమ్మె యగును;
బ్రహ్మవిదునకుఁ గర్మమ్ము, బ్రహ్మ మగును ॥ 24

అందుఁ గొందరు యోగులు యజ్ఞపరులు
దేవతలనె యుపాసింతు రేవలనను;
యజ్ఞమును యజ్ఞముననను బ్రహ్మాగ్నియందు
మఱియుఁ గొందరు వ్రేల్తురు మాన్యమతులు ॥ 25

చెవి మొదలగు నింద్రియములఁ జింతచేసి
సంయమాగ్నిని వ్రేల్తు రాసక్తి నొరులు;
శబ్ద మాదిగ విషయాల జాల మితరు
లింద్రియాగ్నిని వ్రేల్తు రెంతేని గుఱిని ॥ 26

మఱియు నొరు లింద్రియముల కర్మములఁ, బ్రాణ
కర్మములను, వివిధ సర్వకర్మములను,
ఆత్మసంయమ యోగాగ్నియందు వ్రేల్తు
రంచిత జ్ఞాన దీపితు లౌటఁ జేసి ॥ 27

నిశితమౌ వ్రతములు చేయనేర్చువారి
లటులె ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞ మింకను
యోగయజ్ఞమ్ము స్వాధ్యాయ మున్న యట్టి
జ్ఞానయజ్ఞమ్ముఁ జేయంగఁ జాలు చుంద్రు ॥ 28

పరు లటులనె ప్రాణాయామ పరతఁ జేసి
ప్రాణగతి, యపానగతియు, నడ్డ నేర్చి,
ప్రాణము, నపానమున వ్రేల్చి; ప్రాణమం,ద
పానమును వ్రేల్చుదురు నిజాభ్యాస పరత ॥ 29

ప్రాణములయందు వ్రేల్తురు ప్రాణములను
నియమితాహారు లగుచును నెగడు నొరులు;
వీరలెల్లరు పటు యజ్ఞవిదులు తలఁప,
యజ్ఞమున గత కల్మషు లైనవారు ॥ 30

యజ్ఞ శిష్టామృతమ్మునే యారగింప,
బ్రహ్మను సనాతనుని తాము పడయఁగలరు;
యజ్ఞరహితున కీలోక మరయ లేదు;
అన్యమెటులుండు, కురుసత్తమా! తలంప ॥ 31

బహువిధాల యజ్ఞమ్ములీ భాతి జరుగు
చుండు బ్రహ్మముఖమ్మున మెండుగ నిల;
సర్వమవి తెలియుము కర్మజమ్ములనుచు;
తెలియ, ఈ చొప్పు; ముక్తిని వెలయఁ గలవు ॥ 32

ద్రవ్యమయ యజ్ఞమున కంటెఁ దలఁచి చూడ,
జ్ఞాన యజ్ఞమ్ము శ్రేష్ఠమ్ము, సవ్యసాచి !
సర్వకర్మలు నఖిలమ్మై జ్ఞానమందు
పరిసమాప్తిని బొందెడు, భరత ఋషభ! 33

వందనముచేత, సేవచేఁ, బ్రశ్నచేత,
జ్ఞాన ముపదేశమును జేయఁ జాలువారు
జ్ఞాను లగుతత్త్వవేత్తలు సర్వులనుచు
జ్ఞప్తి నిడుకొమ్ము, కౌన్తేయ! సంతతమ్ము ॥ 34

దేనిఁ దెలిసినఁ, బ్రస్తుతస్థితిని బోలి
మరల మోహమ్ము పొందవు, కురు కుమార!
దేనిచే భూతముల నెల్లఁ దెలియఁ గలవు
మొదట నీయందుఁ, నాయందుఁ బిదప రూఢి ॥ 35

సకల పాపమ్ములకు నికృష్టంపుఁ బాప
మాచరించినవాఁడవే యైన నేని,
సర్వవృజినమ్ము నీవిట సంతరింపఁ
దగుదు జ్ఞానప్లవమ్ము మాత్రమ్ము చేత ॥ 36

ఎట్టు లెండు కట్టెలఁ బ్రజ్వలించు నగ్ని
భస్మమై పోవఁ జేయునో, పాండు పుత్త్ర!
అన్ని కర్మమ్ములను జ్ఞాన మనెడు నగ్ని
భస్మముగఁ జేయు నటు జ్ఞాన పటిమ చేత॥ 37

జ్ఞాన సదృశ పవిత్రమ్ము కానబడదు
నుంత యీ లోకమునయందు చూడ, పార్థ!
అది తనకుఁ దానె లభియించు, నరుగు కొలఁదిఁ
గాల మది, యోగమున సిద్ధిఁ గను సుకృతికి ॥ 38

జ్ఞానము లభించు ( దప్పక సంయతేంద్రి
యుండు శ్రద్ధాళువై, తత్పరుండునైన;
జ్ఞానమును బొంది, కాలమ్ము స్వల్పమైనఁ,
బరమ శాంతిని నాతండు పడయ నౌను ॥ 39

అజ్ఞుఁ, డశ్రద్ధధానుండు, నైన యతఁడు
సంశయాత్ముఁడే యైన నాశనము చెందు;
ఇహము లేదు, పరమ్ములేః; దెందుఁ గూడ
సుఖము సంశయాత్మున కెన్న సున్న యగును ॥ 40

కర్మముల సంన్యసించి యోగమ్ము కతన,
జ్ఞానమునఁ జేసి సంఛిన్న సంశయుఁడయి,
యాత్మవంతుఁడైనతని నావంతయైనఁ
గర్మములు కట్టివేయవు గాదె, పార్థ! •41

పొడమి యజ్ఞానమున, హృదిపొంతనున్న
యీ త్వదీయ సంశయమును నిందుచేత
ఛేదనము చేసి, జ్ఞానాసిఁ, జేరు, పార్థ!
యోగ సన్నిధి; లే, లెమ్ము యుద్ధమునకు ॥ 42

ఇటులు
జ్ఞానయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### ఐదవ అధ్యాయము
### కర్మ సంన్యాస యోగము

అర్జునుడు :అనును
కర్మసంన్యాస, మటులె యోగమ్ము, తిరిగి
పొగడుచున్నావు నీ వయో, పురుష వృషభ!
ఏయొకటి శ్రేయమును గూర్చు నిందు, దాని
మాత్రమే నిశ్చితముఁ జేయుమా, మహాత్మ ! 1

శ్రీ భగవానుడుః అనును
కర్మయోగ సంన్యాసముల్ కలుగఁ జేయు
రెండు నిశ్శ్రేయసము సుమ్ము, పాండవేయ!
ఐన, వీనిలోఁ గర్మ సంన్యాసమునకు
మించి, కర్మయోగమొనర్చు మేలు హెచ్చు ॥ 2

ఎవఁడు ద్వేషింపఁడో, కాంక్షయేని కనఁడొ,
అతఁడు నిత్యసంన్యాసిగ ననుకొనఁదగు;
ద్వంద్వములు లేనియతఁడు బంధముల నుండి
సుఖముగ విముక్తి కనుఁగదా, క్షోణి యందు ॥ 3

సాంఖ్యయోగమ్ము లొకటి కాఁజాల వనుచు
బాలు రనెదరు; పండితుల్ పలుక రటుల;
ఒంట లెస్సగ స్థిరమయి యున్నయెడలఁ,
పొందు రెండింటిఫల; మిల్ల సందియమ్ము ॥ 4

సాంఖ్యమునఁ జేసి ప్రాప్తించు స్థాన మెద్ది
యదియె యోగమ్ము చేత లభ్యమ్ము సుమ్ము;
ఉర్వి సాంఖ్యమ్ము యోగమ్ము నొండు కాఁగ
నెతఁడు చూచునొ, చూచువాఁడతఁడె, నిజము ‖ 5

ఐన, యోగమ్ము లేక సంన్యాసి కాఁగ
దుఃఖ మొనగూర్చు, కౌన్తేయ! తొలుతనుండి;
కాని, యోగయుక్తుఁడు ముని కాఁగ, బ్రహ్మ
నచిరకాలమ్మునను పొంద ననువు కలుగు ‖ 6

యోగయుక్తుఁడు, శుద్ధాత్మ యొప్పువాఁడు,
విజిత మగు నింద్రియము లాత్మ వెలయువాఁడు,
సర్వ భూతాత్మ భూతాత్ము సరణివాఁడు,
కర్మలను జేయుచుండియుఁ గట్టు వడఁడు ‖ 7

తత్త్వ విత్తైన్న యుక్తుఁడై, తా నొకింత
చేయుటయె లేదటంచును జింత చేయు,
చూచుచును, విన్చు, మరి స్పృశించుచును, దినుచు,
వాసనను జూచుచును, మఱి శ్వాస గొనుచు, 8

నడచుచును, నిద్రపోవుచు, విడుచుచుండి,
మాటలాడుచును, గ్రహించు, చాటలవలె,
తెఱచుచును, మూయుచును గండ్లు తెఱపి కలిగి,
యింద్రియమ్ముల కొఱకునై యింద్రియమ్ము
లిటుల వర్తించుచున్నట్టు లెంచుచుండి ‖ 9

బ్రహ్మ కర్పింప సకలకర్మము లొనర్చి,
సంగము నెవండు వీడంగఁ జాలు, నాతఁ
డఘముచే నెంతమాత్రమ్ము నంటువడఁడు
పద్మపత్రమ్ము నీటిచే వలె, కిరీటి ‖ 10

ఆత్మశుద్ధికై సంగమ్మునంత విడచి,
యోగులగువారు కర్మ చేయుదురు దాన,
కాయమును, మనస్సును, బుద్ధి, కారణముగఁ
గేవల మ్మింద్రియమ్ములద్రోవఁ జనుచు ‖ 11

కర్మఫలమును యుక్తుండు కాదటంచు,
నైష్ఠికపు శాంతి తాను బొందంగ నగును;
కామ కారణమున, ఫలకాంక్షచే, న
యుక్తుఁడయి, బంధములఁ జిక్కియుండు నిందు ‖ 12

అన్ని యింద్రియమ్ములు వశమైన దేహి
సర్వకర్మల మనసున సంన్యసించి,
యేమి చేయక, తాను చేయింపకుండ,
సుఖి యగును నవద్వారాల సొగసు పురిని ‖ 13

కర్మములఁ గర్తృభావమ్ము కలుగ నిడఁడు
ప్రభువు లోకాన కెంత మాత్రమ్ము నేని;
కర్మఫలము సంయోగమ్ముకాని లేదు;
ఆ స్వభావమ్మె వర్తించు నయ్య, పార్థ ! 14

విభుఁడెవని పాపమును గాని స్వీకరింపఁ,
డే యతని సుకృతమ్మైన నేని; జ్ఞాన
మద్ది, జ్ఞానహీనత చేత నావృతమ్ము;
కాన, జంతువుల్ మోహమ్ములోన మునుఁగు ॥ 15

కాని, యెవ్వరిదైన యజ్ఞాన మద్ది
జ్ఞానమున నాశనమ్మయి చనెడు, నట్టి
వారి జ్ఞాన మాపరమును భానునివలె
వెలుగఁ జేయును సుమి, పాండవేయ! వినుము ॥ 16

అందునే బుద్ధినిడి, యందు నైక్యమగుచు,
అందు నిష్ఠ యొప్పఁగ, భక్తి యందె కలుగ,
జ్ఞాన నిర్ధూత కల్మషు లైనవారు
చెందుదురు మఱి పుట్టని చిరపదమ్ము ॥ 17

వినయ విద్వాంసుఁడైనట్టి విప్రునందు,
గోవునందును, గజమందుఁ, గుక్కయందుఁ,
గుక్కమాంసమ్ము తిను నీచగుణుని యందు,
సమమె చూతురు పండితోత్తములు, పార్థ ! 18

ఎవ్వరి మనస్సు సమతయందే స్థితమ్మొ
వారి కిహమందె సర్గమ్ము వశ్యమగును;
సమము నిర్దోషమయిన బ్రహ్మము తలంప;
అందుచే, వారు బ్రహ్మమ్మునందు స్థితులు ॥ 19

బుద్ధి స్థిరపడి, తగ, నసమ్మోహుఁడైన,
హర్ష మదిలేదు ప్రియము సంప్రాప్తమైన;
కాక, యప్రియమ్మైన, దుఃఖమ్ము లేదు;
బ్రహ్మమున యందు స్థితుఁడౌను బ్రహ్మవిదుఁడు ॥ 20

బాహ్య విషయమ్ములందు నేపాటి సుఖమ
సక్తుఁ డాత్మనే పొందఁగఁజాలు, నట్టి
సుఖము నక్షయమ్ముగఁ బొందుచుండు సతము
బ్రహ్మయోగయుక్తాత్ముండు, పాండవేయ ! 21

ఏవి భోగముల్ సంస్పర్శ లిడఁగఁ జాలు
అవ్వి యాద్యంతములు కల్గి, అతుల దుఃఖ
కారణము లగునట్టివే కాదె, పార్థ!
వానియెడఁ బ్రీతిఁ బొందండు పండితుండు ॥ 22

ఏనరుఁడు దేహముక్తికి నింకముందె,
కామమును గ్రోధమిడెడు వేగమ్ము నిగ్ర
హింపఁగ సమర్థుఁడయి యొప్పు నిందె యుండ,
అతఁడె యుక్తుండు; సుఖుఁడన నతఁడె నరుల ॥ 23

ఆత్మనె సుఖమ్ముఁ, గ్రీడ, లేయతని కగునా?
అటులె, యాత్మనే వెలుఁగు, నే యతని కగునా?
అట్టియోగి బ్రాహ్మస్థితి నందఁ గలిగి,
బ్రహ్మనిర్వాణమును దాను బడయు నగును ॥ 24

క్షీణ కల్మషులై ఋషుల్ భిన్నసంశ
యాత్మకులయి, యుక్తాత్ములై, యఖిలమైన
భూతహితమందు రతులయి, పొసఁగువారు,
బ్రహ్మనిర్వాణమును దాము పడయు చుంద్రు ॥ 25

కామమును గ్రోధమును లేక క్రాలువారు,
యతులు, నియత చేతస్కులు, నదియుఁగాక,
మఱియు సంవిదితాత్ములై మసలునెడల,
బ్రహ్మనిర్వాణ మంతటఁ బరిఢవిల్లు॥ 26

స్పర్శముల్ డిగ్గి బాహ్యముల్ బాహ్యమందె,
కనుల భ్రూమధ్యమున యందుఁగాఁగ నిలిపి,
నాసములలోన చరియించునట్టి వానిఁ
బ్రాణము నపానమును సమపడఁగఁ జేసి ॥ 27

యతమనో బుద్ధులును నింద్రియములు కలిగి,
విగతరాగ భయక్రోధవృత్తిఁ జెలఁగి,
మోక్షమునఁ బరాయణుఁడగుముని యెవండో
యతఁడు సర్వదా ముక్తుఁడే యయి తనర్చు ॥ 28

తపములకు యజ్ఞములకు భోక్తగ నెఱింగి,
సర్వలోకమ్ములకు మహేశ్వరుఁ డటంచు,
ఎల్ల భూతమ్ములకు నైనహితుఁడె యనుచు,
నను నెఱుంగు నాతఁడు శాంతిఁ గనును, పార్థ! 29

ఇటులు

కర్మ సంన్యాస యోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### ఆరవ అధ్యాయము
### ఆత్మ సంయమ యోగము

శ్రీ భగవానుడు : అనును
కర్మఫల మాశ్రయింపక నిర్మలమతిఁ
గార్యమగు కర్మచేయంగఁ గడఁగు నెతఁడు,
అతఁడు సంన్యాసి యనఁదగు; నతఁడు, యోగి;
అక్రియుఁడు కాఁడు; కాడు, నిరగ్ని యేని ॥ 1

దేని ననెదరు సంన్యాసమౌ నటంచు,
యోగమని దానినే తెలియుము, కిరీటి!
ఎవ్వఁడును యోగి కానేరఁడే విధాన
లేద, సంకల్ప సంన్యాస మాదినుండి ॥ 2

యోగమును బొందెడి తలంపె యున్నమునికిఁ
గర్మమును జెప్పెదరు బుధుల్ కారణముగ;
కారణము శమం బయ్యెడిఁ గర్మ చేయ
నతఁడె యారూఢుఁడై యున్నయట్టి స్థితిని ॥ 3

ఇంద్రియార్థమ్ము కర్మలయెడను సంగి
కాక, సంకల్ప సంన్యాసి క్రాల నేర్చు
నెప్పు, డపుడు యోగారూఢుఁడితఁడటంచుఁ
బలికెదరు పండితులు వాని ప్రజ్ఞ నెంచి ॥ 4

ఆత్మ నుద్ధరింపఁగవలె నాత్మచేత;
తనను దాన్ నాశనము చేసి కొనఁగ రాదు;
ఆత్మకును బంధువగునది యాత్మయె గద ॥
ఆత్మకును శత్రువగునది యాత్మయె గద ॥ 5

ఎవని యాత్మచే నాత్మ జయింపఁ బడునొ,
యతని యాత్మ కాత్మయె బంధువై తనర్చుఁ;
గాని, యాత్మ లోబడనట్టివాని పట్ల
శత్రు భావమ్ముతో నాత్మ సంచరించు ॥ 6

తాన్ జితాత్ముఁడై, శాంతుఁడై, తనరెడు పర
మాత్మ, మానావమానాలయందు, నటులె,
కలుగు శీతోష్ణసుఖదుఃఖములను గూడ
నిర్వికార సమాహిత నిష్ఠ నిలుచు ॥ 7

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁడైన యతఁడు,
అశ్మలోష్ట కాంచన సముఁడైన యతఁడు,
నిర్జితేంద్రియుఁడగు యోగి నిర్వికారుఁ
డతఁడు మాత్రమ్ము యుక్తుఁడం చనఁగ నౌను ॥ 8

అరులు, మిత్రు, లుదాసీనులైన, ద్వేష్య
లో, సుహృత్తులో, మధ్యస్థులో, యహితులో,
బంధువులో, సాధువులో, లేక, పాపులో, యిల
నెవ్వరైనను సమబుద్ధినే మెలంగు
వారె శ్రేష్ఠులుగ గణింపఁ బడెడువారు ॥ 9

ఒక రహస్యప్రదేశమందుండి యోగి
నియత చిత్తాత్ముఁ, డేకాకి, యయి, నిరాశి
యై, పరిగ్రహ శూన్యుఁడై, యనవరతము
ధ్యానమున మగ్నమును జేయ నగును నాత్మ ॥ 10

ఒక శుచియగు పదేశమ్ము నుండఁ జూచి
ఎత్తుగను గాక, పల్లమ్మునేని కాక,
వరుసఁ జేలాజినకుశాళి పరము కాఁగఁ,
దనదు నాసనము స్థిరమ్ముగను గుదిర్చి ॥ 11

అట్టి యాసనమున నుండనై, మనస్సు
నిశ్చలము కాఁగఁ జేసియు, నియతమైన
యింద్రియ మనఃక్రియుం డాత్మ కెనఁగ శుద్ధి
యోగ మభ్యాసమును జేయుచుండవలెను ॥ 12

కాయము శిరస్సు గ్రీవమ్ముఁ గాగ సమము,
ముఖ్యముగఁ జూచుచును దనముక్కుకొనను,
అచలముగను స్థిరమ్ముగ నైన దృష్టి,
దిక్కు లిటునటుఁ జూచెడు దిక్కు పోక ॥ 13

విగత భయమును శాంతాత్మ వెలయుచుండి,
బ్రహ్మచారి వ్రతమ్మునఁ బడసి స్థిరత,
నియతమనమున మచ్చిత్తుఁడయి తనర్చి,
మత్పరుండయి, యుక్తుఁడై, మనఁగవలయు ॥ 14

నియత మానసుఁడయి యోగి నిరత మిట్టు
లాత్మను సదా సమాధాన మందఁజేసి,
పరమ నిర్వాణమగు శాంతిఁ బడయ నగును
నా యెడను సంస్థమై యొప్పునట్టి శాంతి ॥ 15

కాని, తిండి పోతునకు యోగమ్ము లేదు;
హార మదియేమి లేకున్ననైన లేదు;
కా దతి స్వప్నశీలునకైనఁగాని;
అమితముగను మేల్కొను వానికైనఁగాని ॥ 16

హారమున విహారమ్మున నయిన నియతి,
కర్మము లొనర్పఁ జేష్టలఁ గలుగ నియతి,
స్వప్నమున జాగ్రతను గనబడిన నియతి,
కలుగు యోగమ్ము పరమ దుఃఖాపహరము ॥ 17

ఎపుడు వినియత మగు చిత్త, మే యతనిది
ఆత్మయందునె యవతిష్ఠ మగునొ, పార్థ !
సర్వకామమ్ముల స్పృహ కాసంత లేక,
అప్పు డాతండు యుక్తుఁ డం చనఁగఁబడెడు॥ 18

గాలి లేకుండు చోటను గ్రాలుదీప
మెటును జలియింపకుండు; అప్పటిది స్థితిని
ఉపమగఁ దలంత్రు యతచిత్తయోగి యాచ
రించు నాత్మయోగమునకు నంచితముగ ॥ 19

ఎప్పుడు నిరుద్ధమగు చిత్త, మెట్టి స్థితిని,
యోగసేవ కారణముగనుపరమించు;
ఆత్మ నాత్మయందునె చూచి, యాత్మయందె
యెపుడు పొందునొ తాను సంతృప్తి నెల్ల ॥ 20

బుద్ధికే గ్రాహ్య, మింద్రియముల కతీత
మెయ్యది సుఖమ్ము యత్యంతమిందు, నద్ది
యెప్పు డనుభవమగు, దీననే స్థిరమయి,
తత్త్వమునను జలింప డెద్దానినుండి ॥ 21

దేనిఁ బొందంగ, నిరతమ్ము దానికంటె
నధిక లాభమ్ము తలఁపఁడో స్వాంతమందు,
దేనియందున్న, నే గొప్పదైన దుఃఖ
మేనియుఁ జలింపఁజేయదో వాని నిందు ॥ 22

ఉర్వి దుఃఖ సంయోగ వియోగ మనెడు
దాని, యోగ సంజ్ఞితముగఁ దలఁప వలయు;
అట్టియోగ, మ్ము నిర్విణ్ణమైన మనసు
తోడ నాచరింపంగ నత్యుత్తమమ్ము ॥ 23

కామములను సర్వమును సంకల్పజముల
నొక్కటేనియు శేషింపకుండ విడచి,
మనసు చేత సంపూర్ణమ్ముగను సమస్త
మైన యింద్రియమ్ములను స్వాధీనపఱచి ॥ 24

ధృతి గ్రహించిన బుద్ధిచే నించుకించు
కగను మెలమెల్ల నుపరతిఁగనఁగ వలయు;
మనసు నాత్మ సంస్థమ్ముగ నొనరఁ జేసి,
కొంచెమును గూడఁ జింతింపఁగూడ దంత ॥ 25

చంచలము నస్థిరమ్మైన చపలమనసు
వేనివేనిని గూర్చి పర్వెత్తు వెనుక,
వానివానిని నియమించి, వశము చేయ
వలయు నేత దాత్మకును నెప్పటికి నపుడు ॥ 26

మనసు శాంతిల్లఁగను, రజోగుణము తొలఁగ,
బ్రహ్మ భూతుఁడై కల్మషరహితుఁడైన
యిట్టియోగిని దనకుఁ దానే సతమ్ము
పొందెడిని నుత్తమమ్మైన పూర్ణసుఖము ॥ 27

విగత కల్మషుఁడై, యోగి స్వీయమైన
యాత్మ నిటు సదా చేర్చి యభ్యాసమందు
బ్రహ్మసంస్పర్శ మత్యంత పరమ సుఖము
ననుభవమునకుఁ దాఁ దెచ్చికొనును, పార్థ! 28

సర్వమున యందును సమదర్శనుఁడై యగుచు,
సర్వభూతమ్ములను గనఁజాలి తనను,
సర్వ భూతమ్ము లాత్మ నెసంగఁ గనుచు,
యోగయుక్తాత్ముఁ డగు యోగి యుండనగును ॥ 29

ఎవఁడు సర్వమ్మునను గను నెపుడు నన్ను,
ఎవఁడు నాయందు సర్వమ్ము నెపుడుఁ గాంచు,
నేను లేకుండఁ బోను నవ్వానికెన్న;
అతఁడు లేకుండఁ బోఁడు నా కటులె, పార్థ ! 30

ఎవ్వఁ డేకత్వమున స్థితి యెసఁగి, నన్ను
సర్వభూతస్థితు భజించు, సకల గతుల,
అట్టియోగి ప్రవర్తించినప్పుడేని,
ఉర్వి నాయందె వర్తించుచుండు సుమ్ము ॥ 31

అగును గాక సుఖము, దుఃఖ మగును గాక,
తననువలె నెల్ల జీవులఁ గనుచుఁ, దన్ను
నారులను సమమ్ముగను జూచుపరముఁ డెవఁడొ,
అట్టి యోగియె శ్రేష్ఠుఁడౌ ననుచు ననెద ॥ 32

అర్జునుఁడుః అనును
ఏది యీ సామ్య యోగమ్ము నీవు బోధ
పడఁగఁ జేసితో, దానికి వలయునట్టి
స్థిరమగు స్థితిని నేనేమి యరయఁ జాల
కుంటిఁ జంచలత్వమ్ముచే, ఓ మహాత్మా! 33

చంచలము గదా మనసు, కృష్ణా! తలంప;
దృఢమును, ప్రమాథి, బలమైనదియును గూడ;
దాని నిగ్రహింపఁగ నేను దలఁచు టెల్ల,
గాలిమూటను బోలె, దుష్కరము సుమ్ము ॥ 34

శ్రీ భగవానుఁడు : అనును
మనసు, నిగ్రహింపఁగఁ గష్టమును, చలమ్మ;
హే మహాబాహు! సంశయ మింత లేదు;
ఐన, వైరాగ్యమునను నభ్యాసముననుు
నిగ్రహింప సాధ్యమ్మ, కౌన్తేయ! నిజము ॥ 35

అనియతాత్ముండు యోగమ్ము ప్రాప్తి పొందఁ,
గాదు తెలికయని సుమీ నాదు మతియ;
ఐన, వశ్యాత్ముఁడైన యభ్యాసకునకు
శక్యమగు నుపాయమున; సంశయము లేదు ॥ 36

అర్జునుఁడు :అనును
కలదు శ్రద్ధ; యైనను, యతి కా దతండు;
యోగముననుండి చలియించియున్న మనసు;
యోగసంసిద్ధి పొందెడు యోగమిల్ల;
అతని గతి యేమి, అచ్యుతా! అంతమందు॥ 37

మూఢుఁడై, అప్రతిష్ఠుఁడై, పురుషవృషభ!
బ్రహ్మ మార్గమ్మ నందునఁ బడకయడుగు,
ఉభయమునయందు భ్రష్టుఁడై, యొడ్డు గనక,
నాశనము చెందఁ డొక్కొ ఛిన్నాభ్రము వలె? 38

నాదు సంశయమును దీని, నేది మిగుల
కుండఁ, దీర్పంగలట్టి, యర్హుండ వీవు;
ఇట్టి సంశయమును దీర్ప నీవు దక్క
యన్యుఁ డొండు కన్పింపఁ, డోయవ్యయాత్మ! 39

శ్రీ భగవానుఁడు ఃఅనును
లేదు చెడు, గట్టివానికి లేదు, పార్థ!
ఇహమునను లేదు, స్వర్గాన నేని లేదు;
ఏ యొకరుఁడును శుభములనే యొనర్చి,
తాత! దుర్గతి దేనిఁ బొందండు సుమ్ము ‖ 40

పుణ్య పురుషుల లోకముల్ పొంది, పెక్కు
వత్సరములందు నివసించి, భాగ్యవంతు
లగు పవిత్రుల గేహమ్ములందుఁ బుట్టె
డును సుమా యోగమున నుండి దొరలు నతఁడు ‖ 41

లేద, పుట్టును ధీమంతులెయగు యోగి
వరుల కులమున యందునే, పాండవేయ!
ఐన, ఈ లోకమునను, ఈ యట్టి జన్మ
దుర్లభతరమ్ము సుమ్ము, పార్థుఁడ! తలంప ‖ 42

అచట, ఆపూర్వదైహికమైన యట్టి
బుద్ధి సంయోగము లభించి, పొందనగును;
దాన, మరల యత్నించు, నంతకును ముందు
కంటె హెచ్చు సంసిద్ధికై, కౌరవేయ! 43

అట్టి పూర్వమందైన యభ్యాస పటిమ,
అవశు నటు లాగఁ బడుసుమీ, అల్లయతఁడు;
యోగ జిజ్ఞాసువుగ నయి యున్నఁగూడ,
దాటిపోవు శబ్ద బ్రహ్మ దశను నిజము 44

ఐన, బూర్తి పూనిక తోడి యత్న మెసఁగ,
యోగి, తన కిల్బిషమ్ములనుండి పాసి,
పెక్కు జన్మాలసిద్ధి పెంపెక్కఁ గాంచి,
పరమ మగుగతి యంతటఁ బడయఁ గలఁడు ॥ 45

తాపసులకంటె నధికుండు తలఁప యోగి;
జ్ఞానులను మించి యధికుండె యౌను యోగి;
కార్మికులకంటె నధికుండు కాదె యోగి?
కావునను, పార్థ! యోగివి కమ్ము నీవు ॥ 46

అంతరాత్మను భక్తి నాయందు నిలిపి,
నను భజించెడు శ్రద్ధతోడను నెతండు,
యుక్తతముఁ డాతఁ డనుచు నా యొక్క మతము
అఖిలమగు యోగులందరి యందుఁ గూడ ॥ 47

ఇటులు
ఆత్మ సంయమ యోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### ఏడవ అధ్యాయము
### జ్ఞాన విజ్ఞాన యోగము

శ్రీ భగవానుఁడు : అనును

మనసు నాయందు సక్తమై తనర, పార్థ!
ఆశ్రయము నేనుగా, యోగమభ్యసించి,
నను సమగ్రమ్ము, సంశయమును దొలంగి,
యెటు తెలిసి కొందొ, యయ్యది యిదిగొ, వినుము ॥ 1

ఏది తెలిసిన మఱి యొకం డిహమునందు
మిగిలి యుండదొ యొగిఁ దెలియఁగను, దాని,
ఈ సవిజ్ఞానమగు జ్ఞాన, మిపుడు నీకుఁ
జెప్పుచున్నాను, విజయ! అశేషముగను ॥ 2

వేలకొలఁదిని గల మనుష్యాళియందు
నొకఁడు మాత్రమ్మ యత్నించు నొంద సిద్ధి ;
సిద్ధికొఱకును యత్నమ్ము చేయు నరుల
నాదు తత్త్వమ్ముఁ దెలిసెడు నరుఁ డొకండె ॥ 3

భూమి, నీరు, నగ్నియు, వాయువు, గగనమ్ము,
మనసు, బుద్ధి, యహంకారమును, ననంగ
అష్టవిధములను విభిన్నమౌచు నాదు
ప్రకృతి యయ్యది, అర్జునా! పరఁగు చుండు ॥ 4

అపరమిది; యిద్ది కాక, యన్యమ్ము, నాదు
ప్రకృతి, జీవ భూతమ్మను పరము, పార్థ!
ఈ జగత్తును నెది ధరియించుచున్న
దది, మహాబాహు! ఇయ్యది; మదినెఱుంగు॥ 5

సకలభూతమ్ము, లీరెండు ప్రకృతులె తమ
మూలముగఁ బొడమిన వంచు బుద్ధి నిలుపు;
ప్రభవ మేను జగత్తు సర్వమ్మునకును;
ప్రళయ మేను జగత్తు సర్వమున కలుగె ॥ 6

అన్యమేదియు నాకంటె నావయంత
పరతరమ్మైనయది లేదు, పార్థ! కనఁగ;
సూత్రమున మణి గణముల చొప్పు, కూర్పఁ
బడెను నాయందు నిదియెల్ల, పాండవేయ ! 7

నీటిలో రసమేను, కౌన్తేయ! తెలియు;
రవి శశులయందుఁ గలయట్టి ప్రభను నేను;
పరమ వేదమ్ము లందలి ప్రణవ మేను;
ఖమున శబ్దమ్ము, నరపౌరుషమును నేను ॥ 8

పృథివిఁ గల పుణ్యగంధమ్ము నేన, పార్థ!
అగ్నిఁ గల యట్టి తేజస్సు నదియునేన;
సర్వభూతాల జీవన సర్వమేన;
తాపసులయందు దీపించు తపసు నేన ॥ 9

సకల భూతమ్ములకును బీజమ్మునైన
నన్ను దెలియుమా, పార్థ! సనాతనమ్ము;
బుద్ధిమంతుల యందరి బుద్ధి నేను;
అఖిల తేజస్వినుల తేజ మదియు నేను ॥ 10

కామ రాగ వివర్జితులై మెలంగు
బలము కలవారియందలి బలము నేను;
అఖిల భూతమ్ములందు ధర్మావిరుద్ధ
మయిన కామమ్ము, అర్జునా! అగుదు నేను ॥ 11

ఏవి సాత్త్విక భావమ్ము, లేవి యేవి
రాజసములు, తామసములు, ప్రకటముగను,
అవ్వి నానుండి పొడమిన వనుచుఁ దెలియు;
వానిలో లేను; అవియు నాలోన లేవు ॥ 12

త్రిగుణమయ మగు భావముల్ దృశ్యమాన
సర్వజగమును దీని నజ్ఞానమునను
ముంచుట, జగత్తు తెలియంగఁబోదు నన్ను,
వీనికిఁ బరమ్ము, అవ్యయు, విజయ! సుంత ॥ 13

మూడు గుణములమయ మిద్ది, జోడు లేని
దైవ మాయ నాయది, దురత్యయము, పార్థ!
ఎవరు శరణు చొచ్చెదరో నన్నే ధరిత్రి,
వారె యీ మాయను దరించి వరలు వారు ॥ 14

పాపకర్ములు, మూఢులు, పాడుమనుజు
లపహృత జ్ఞానులై, మాయ యావరింప,
అసురుల స్వభావములను దామాశ్రయించి,
నన్ను బొందంగ నేరరు నన్నెఱుఁగక ॥ 15

సుకృతులైనట్టి జనులు విశుద్ధభక్తి
నాల్గు విధముల భజియింత్రు నన్ను, పార్థ !
ఆర్తులగు వార, లర్థార్థులైనవారు,
అల్లజిజ్ఞాసువులు, జ్ఞానులైనవారు ॥ 16

వారిలో నుత్తముఁడు, జ్ఞాని; పరమభక్తి
నొప్పువాఁడు నాయెడ, నిత్యయుక్తుఁడగును;
జ్ఞానికిఁ బ్రియుండ నత్యంత మేను; కాదె?
అతఁడు నాకును బ్రియుఁడగు; నటులె, పార్థ ! 17

వీరలందరు నెన్న నుదారు; లైన,
జ్ఞాని నాయాత్మయే యని నేను దలఁతు;
అతఁడు యుక్తాత్ముఁడగుచు నాయం దనుత్త
మగతి నెంతయు స్థిరపడి మనెడు; కాదె? 18

వాసుదేవుఁ డొక్కండె సర్వమ్ముటంచుఁ
బెక్కు జన్మలు గడచిన వెనుకఁగాదె
జ్ఞానవంతుండు పొందంగఁజాలు నన్ను?
దుర్లభుండట్టి యొక మహాత్ముండు తలఁప ॥ 19

స్వీయ ప్రకృతిచే నియమితుల్ చేయఁ బడుచు,
చాల కోర్కులచే హృతజ్ఞాను లగుచు,
ఆశ్రయించుచు నాయా నియమము లెటులొ,
అన్య దేవతల భజింప నగుచు నుంద్రు ‖ 20

భక్తుఁడెతఁడెట్టి రూపదేవతను, శ్రద్ధ
కూడు కొనఁ గను నర్చింపఁ గోరుచుండు,
అతని యచల మౌ శ్రద్ధ నాయతని యందె
దృఢపరచుచునె యుండెద నేను గూడ ‖ 21

ఆతఁడాత్మీయ శ్రద్ధయే యండకాఁగ,
అతని యారాధనమ్ము చేయంగఁ బూను;
పిదపఁ దన కోర్కె ఫలియింప, ముదమునందు,
నే నొసంగిన యద్దాననే గదయ్య ? 22

అట్టి యల్ప బుద్ధుల దగునా ఫలమ్ము
నాశనము గలట్టిదియె యెన్నాళ్ళకైన;
దేవతలఁ బొందుచున్నారు దేవయజులు;
నాదు భక్తులు పొందంగ నన్నె ధరణి ‖ 23

అవ్యయము, అనుత్తమమును, నైననాదు
పరమ భావమ్ముఁ దెలియని వట్టి మూఢు
లరయ, అవ్యక్తు, వ్యక్తినైనట్లు నన్ను
దలఁచి, పొరబడుచున్నవారలు గదయ్య ‖ 24

సతత యోగమాయా సమావృతుఁడ నేను;
అందరకు నొకింతయుఁ దెలియంగఁ బడను;
అజుని, అవ్యయు, నన్ దెలియంగఁ జాల
దిద్ది మూఢలోకము, జ్ఞాన హీన మగుట ‖ 25

బుద్ధిఁ దెలియుదు నేనెల్ల భూతకోటిఁ
గడచిపోయినవే యైనఁగాని, యున్న
వానిఁగాని, రాఁబోయెడు వానిఁగాని;
ఒక్కరుఁడు నన్ను దెలియంగ నోపఁడు గద ॥ 26

ఇచ్ఛచేత, ద్వేషమ్ముచే, నిందుఁదోచు
ద్వంద్వములమీది మోహమ్ము తమ్ము ముంప,
సర్వభూతమ్ములును సృష్టి సమయమందు
చిక్కుకొనెడు సమ్మోహపుఁ జిక్కునందు ॥ 27

కాని, యే జనములు పుణ్యకర్మము లొన
రించి, విగత పాపాత్ములై మించువారొ,
ద్వంద్వమోహ నిర్ముక్తులై వారు, పార్థ!
నను దృఢవ్రతులై భజనమ్మొనర్తు ॥ 28

ఎవ్వరు జరామరణ మోక్షమెంచి, పొంద,
ఆశ్రయింతురొ నన్ను బ్రయత్న మొనర,
వారు తెలియుదు రాపరంబ్రహ్మ, సకల
మైన యధ్యాత్మ, నఖిలమ్మునైన కర్మ ॥ 29

ఎవ్వరధిభూత, మధిదైవ, మింతె కాక,
పైగ, నధియజ్ఞమును, నొప్పువాని నన్ను
తెలియుదురొ యుక్త చిత్తులై వెలసి, వారు
మరణ కాలమ్మునను నన్ను మరవఁ బోరు ॥ 30

ఇటులు
జ్ఞాన విజ్ఞాన యోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### ఎనిమిదవ అధ్యాయము
### అక్షర బ్రహ్మ యోగము

అర్జునుఁడు :అనును
ఏది యాబ్రహ్మ? అధ్యాత్మమేది, కృష్ణ?
ఏది కర్మ? చెప్పఁగదె యోగేశ్వరేశ!
ఏది, అధిభూతమని పల్కఁ బరఁగు నేది?
దేనిపే రధిదైవమ్మ? తెలియఁ జెపుమ ‖ 1

ఎట్టి మాదిరి దధి యజ్ఞ? మీ శరీర
మందునున్నది, పురుషోత్తమా! అదేది?
అలప్రయాణమప్పుడు నిన్ను దెలియు టెట్టు
లిట సమాహితచిత్తులహీన భక్తి? 2

శ్రీ భగవానుఁడు :అనును
పరమమును నక్షరమ్మను బ్రహ్మ యనఁగఁ
దనదు భావమ్మ నధ్యాత్మ మనుచు నుంద్రు;
భూత భావోద్భవకరమ్మ, పుట్టఁ జేయు
శక్తి, కర్మయనెడు పేర జరుగుచుండు ‖ 3

క్షరపుభావమె యధి భూతమరయ, విజయ!
పురుషుఁడధిదైవతమ్మని పరగుచుండు;
దేహభృతవర, పార్థ! ఈ దేహమందు
నున్న యధియజ్ఞమును నేనె, సన్నుతగుణ ! 4

అంతకాలమ్మున, స్మరింపనగుచు నన్నె
యెవ్వఁడు కలేబరము వీడి యేగు, నతఁడు
పొందుచున్నాడు నాభావ; మిందు గూర్చి
లేదు సంశయ మిసుమంత; లేదు, లేదు ‖ 5

ఏదయినఁగాని, యది యెట్టి యెట్టి భావ
మును స్మరించుచు, ఈ దేహ మొనరవీడుఁ
దుదను, ఆయాయి భావమ్ము తోడి దృష్టి
యగుట, ఆయాయి రూపమ్మె యగును ధరణి ‖ 6

కావునను, నీవు నను సర్వకాలములను
దలఁచుకొనుచునుఁ నుండు; యుద్ధమ్ము చేయు,
మనసు, బుద్ధియు, నాకె యర్పణము చేసి,
పొందెదవు నన్ననే; లేదు సందియమ్ము ‖ 7

అంచితాభ్యాస యోగయుక్తాత్ముఁడగుచు,
అన్యములవైపు మనసు పోనట్టి యతఁడు,
పార్థ! దివ్యమై యొప్పునప్పరమ పురుషుఁ
బొందెడును సదాధ్యానమ్మునందు మునిఁగి ‖ 8

కవి, పురాణపురుషుఁడు, జగన్నియంత,
సర్వధాత, సూక్ష్మాతిసూక్ష్మము, నచింత్య
రూపుఁ, డయిన యాదిత్యవర్ణుని, తమస్సు
నకుఁ బరుని, నెవ్వఁడు స్మరించు నట్టి యతఁడు ‖ 9

తన ప్రయాణమప్పుడు చలింపని మనస్సు
కలిగి, భక్తియుక్తుఁడయి, యోగబల మొప్పఁ
బ్రాణమును నిల్పి లెస్సగ వరల భృకుటి,
ఆ పరమ దివ్య పురుషుని యండ చేరు ॥ 10

వేదవిదు లను నక్షరమేదో దాని;
వీతరాగులు యతుల ప్రవేశ మెచట;
బ్రహ్మచర్యావలంబన ఫల మదేది;
పలుకుదును సంగ్రహముగఁ దత్పదము నీకు ॥ 11

సర్వమైన ద్వారములను సంయమించి,
హృదయమునయందు మనసు బంధించి యుంచి,
తనదుప్రా ణమ్ముఁ దలను నాధారపరచి,
యోగధారణఁ గదలకయుండ నిలిచి ॥ 12

ఓ మ్మనంగఁబడెడు నక్షరమ్ము బ్రహ్మ
నుచ్చరించుచు, స్మరియించుచుండి నన్ను,
విడుచు నెవ్వఁడో దేహమ్ము కడ, నతండు
పరమగతిఁ బొందుచున్నాఁడు, భరత వృషభ ! 13

ఎవఁడనన్య చేతస్కుఁడై, యెడ తెగకయె,
నన్ను స్మరియించు నిత్య, మట్లున్నయతని
కేను సులభుఁడఁ బొందంగ, నెల్ల యపుడు
యుక్తుఁడై యున్న యోగికి, ఓయి పార్థ! 14

పరమ సంసిద్ధి వడసినవార, లా మ
హాత్ములు, నను గూడుకొనుట, నవని వేరు
జన్మ, దుఃఖాలయమ్ము, నశాశ్వత, మగు
నట్టి జన్మఁ బొందఁగఁ బోవ రట్టిస్థితిని ॥ 15

అర్జునా! బ్రహ్మభువన మ దాదికాఁగ,
నన్నియును బునరావర్తనమ్ము కలవె
లోకములు; కాని, నను జేర్కొనిన నేని,
ఉండఁ బోదు పునర్జన్మ, పాండవేయ! 16

అహ సొక సహస్రయుగము పర్యంతమనుచు,
రాత్రియు సహస్రయుగము పర్యంతమనుచు,
బ్రహ్మను గురించి తెలిసెడి వారలెవరొ,
వారలే యహూరాత్రి విద్వాంసులవని ॥ 17

పగటి రాకను బొడము నవ్యక్తమందు
నుండి వ్యక్త సర్వమ్మను నున్నదెల్ల;
రేయి రాక నవ్యక్తమందే యణంగు
నున్నవ్యక్త ప్రపంచమ్మందున్న దెల్ల ॥ 18

నాఁటి యీ భూతజాల మిన్నాళ్ళు పుట్టు
చుండి, రే రాక లయమొందుచుండు వశము
తప్పి; స్థితి నొందుచును నుండు, తప్పి వశము,
పగటి రాకను బ్రభవమ్ము పాలుపడుచు ॥ 19

సర్వమగు భూతములును నాశనము పొంద,
నేది నశియింప, దాభావ, మింతకు మును
నుడివియున్న యవ్యక్తమ్ము విడచు, వేర
యిన సనాతనా వ్యక్తమ్ము, వినుమ, కలదు ॥ 20

అక్షరమ్మను నవ్యక్తమనెదరద్ది ;
పరమ గతియని దానిని బల్కుచుంద్రు;
ప్రాప్తమైదైన యెడలను, రారొ తిరిగి,
యద్దియే నా పరంధామ మగు, కిరీటి ॥ 21

ఎవనియందు భూతమ్ములున్నవియొ నిలచి,
ఈ సమస్తమ్ము వ్యాప్తమౌ నెవనిచేత,
అట్టి యాపరః పురుషుఁడో యర్జునా! అ
నన్య భక్తిచేతను గొల్చిననె, లభించు ॥ 22

యోగు లేకాలమున మృతుల్ కాఁగఁ, బోయి,
మఱలి రారొ, పోయినవారు మఱలి వత్తు
రోయిటకు నట్టి కాలమ్ము, ఓ కిరీటి!
ఇపుడు నీకుఁ జెప్పుచు నుంటి; నిదిగొ, వినుము॥ 23

పగలు, జ్యోతి, యగ్నియు, శుక్లపక్షమదియు,
ఆరునెల లైన యుత్త రాయణమునందుఁ,
బోవువార లందరు బ్రహ్మమును నెఱుంగు
వారు, బ్రహ్మమ్ముఁ జేర్వనువారు, సుమ్ము ॥ 24

రేయియును, నల్లు ధూమమ్ము, కృష్ణపక్ష,
మారునెలలైన దక్షిణాయణము నందుఁ
బోవు యోగి, చంద్రుని వెల్గు పొంది, పొంది,
నరుల యీ లోకమునకును తిరిగి వచ్చు ॥ 25

కృష్ణగతి, శుక్లగతి, యను నివ్వి రెండు
శాశ్వతములని తలఁతురు జగమునందు;
ఒక గతిని బోవఁ, తిరిగి రాకుండు టగును
అన్యగతిఁ బోవఁ, వచ్చుటే యగును మఱలి ॥ 26

ఈ గతుల గుర్తెఱింగిన, నేయొకండు
యోగిమోహమ్మునను మున్గి యుండఁ బోడు;
అందుచే, సర్వకాలమ్ములందుఁ గూడ,
అర్జునా! యోగయుక్తుండ వగుము నీవు ॥ 27

దీని గుర్తెఱింగిన యోగి యేని, వేద
ములను, యజ్ఞమ్ములను, దపమ్ములను, దాన
ములను, నే పుణ్యముల ఫలమ్ముల వచింతు,
రా సమస్తమ్ము తా నతిక్రమము చేసి,
ఆద్యము పరమ్ము స్థానమ్ము నందుఁ జేరు ॥ 28

ఇటులు
అక్షర బ్రహ్మయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### తొమ్మిదవ అధ్యాయము

### రాజవిద్యారాజగుహ్యయోగము

శ్రీ భగవానుడు : అనును

గుహ్య తమము, విజ్ఞానమ్ము, కూడియున్న
జ్ఞానమెయ్యది యశుభమోక్షమ్ము(గూర్చ
నగు, నసూయావిరహితుండ వౌట నీవు,
దాని(గూడ నీకిదె తెల్పు దేను, పార్థ! 1

రాజగుహ్య ముత్తమ మిది; రాజవిద్య;
ధర్మ్యము, పవిత్రము నయి, ప్రత్యక్షముగనె
అవగమము, అర్జునా! అవ్యయమ్మ కూడ;
సుసుఖమగు దీని నాచరించుటకు మిగుల ॥ 2

ఇట్టి ధర్మమ్మునందు నొకింత శ్రద్ధ
లేని పురుషులు నను బొందలేక, పార్థ !
చావుతో(గూడు కొన్న సంసారపథము
ననె పరిభ్రమించెదరు చింతను మునింగి ॥ 3

ఈ సమస్త జగత్తు వ్యాపించి యుండు
నాదు మూర్తియే, వ్యక్తమ్ము కాదు కాని;
అన్ని భూతాలు కలవు నా యందు; నైన,
వానియందవస్థితు (డను గాను నేను ॥ 4

అన్ని భూతమ్ము లుండి నాయందు, లేవు;
చూడు మైశ్వరయోగమ్ముచొప్పునాది;
భూతభావన కలిగించునేతదాత్మ,
భూతభృత్తయి, కనరాదు భూతములను ॥ 5

అంతటను గొప్పవాయువు వ్యాప్తమగుచు
నిత్య మాకాశమున నుండు నెట్టి రీతి,
అట్టిరీతినె భూతమ్ము లన్ని యున్న
వనుచును దెలిసికొమ్ము నాయందు, పార్థ ! 6

అఖిల భూతాలు కల్పక్షయమ్ము వేళఁ
బొందెడును నా దగు ప్రకృతియందు, పార్థ !
వానిఁ దిరిగి కల్పాదిని నేనె సృష్టి
చేయుచున్నాను సుమ్ము, కౌన్తేయ ! విధిగ ॥ 7

ఊతగాఁ జేసికొనుచు నాయున్న ప్రకృతిఁ
తిరిగి, తిరిగి, సృష్టించెద, దీని, జగతి;
ఈ సమస్త భూతగ్రామ మీ ప్రకృతికి
వశమగుటచేత, నున్నది వశము తప్పి ॥ 8

అట్టిపనుల, అసక్తుండనై, తటస్థుఁ
బోలె కూర్చున్ననన్ను, ఓ పురుషవృషభ !
ఎంతమాత్రమ్ము బంధింప నిందు నేర,
వా సమస్త కర్మ, ల వెట్టి పాటివైన ॥ 9

ప్రకృతి కనుచున్నయది సచరాచరమ్ము
నగు ప్రపంచమ్ము, నేనయధ్యక్షుఁడుగను;
ఇదియెహేతువై, దొరలుచు నేగుచున్న
దీ జగచ్చక్ర మిటులు, కౌన్తేయ! విధిగ ॥ 10

ఈ పరంభావు, భూతమహేశ్వరు, నను,
మొదటినుండియుఁ దెలియంగఁబోనివారు
మూఢులై, మానవ శరీర మొందినట్టి
వానిగను నన్ను జులకనపఱచు చుంద్రు ॥ 11

మోఘ మాశలు, కర్మలు మోఘమె యయి,
మోఘమై జ్ఞానమును, దుష్టబుద్ధులు నయి,
రాక్షసమొ,యాసురమొయగు ప్రకృతి నాశ్ర
యింతురు విమోహితు లగుచు నిహము నందు ॥ 12

కాని, ఆ మహాత్ములో, దివ్యమైన ప్రకృతి,
ఆశ్రయించి, ధనంజయా ! అవ్యయమ్ము,
భూతముల కాది, యగు నన్ను చేతమునను
దెలిసి, భజియింతురు, మనస్సు నిలిపి యొకట ॥ 13

దృఢమగు వ్రతమ్ముచేత యత్నించుచుండి,
నన్ను గీర్తించు చుండెద రన్ని యెడల;
భక్తితో నమస్కృతుల నర్పణము చేసి,
నిత్యయుక్తు, లుపాసన నెఱపు చుంద్రు ॥ 14

ఇతరు లేకత్వముననో, లేదేని, విశ్వ
తోముఖుని బృథక్త్వముననో, తాము బహువి
థాల జ్ఞానయజ్ఞమ్ము చేతను యజించి
న న్నుపాసింతురు తమ మనస్సు కొలది ॥ 15

నేను క్రతువును, యజ్ఞమ్ము నేను, శ్రాద్ధ;
మేను మఱి యౌషధమ్మును నేను జూవె;
నేను మంత్రమ్ము, నాజ్యమ్ము నేను మఱియు;
నేన యగ్నిని, హుతమును నేను గాదె? 16

ఈ జగత్తునకును బిత యేను, మాత,
ధాతయుఁ, బితామహుండు, వేద్యము, పవిత్ర
మైనదియును; ఓంకారమ్ము; అంతెగాక,
ఋక్కును, యజస్సు, సామమ్ము, నివ్విమూడు ॥ 17

ప్రభువు, సాక్షియు, గతియు,భర్తయును నేను;
శరణమును, సుహృత్తును, నివాసమును నేను;
ప్రభవమును, స్థానమును నేను; ప్రలయమేను;
అఖిలము, నిధానమును, అవ్యయమ్మునేను ॥ 18

నేను దపియింపఁజేయు చున్నాను; వర్ష
మును విడచెదను; మఱి, విడువనొకయపుడు;
మృత్యువును నేను; మఱియు, అమృతము నేను;
నేను సత్తు; అసత్తును నేను, పార్థ ! 19

పాపములు పోయి సోమమ్ముపానమునను,
వేదవిదులు యజ్ఞాల నన్ వేడ్కఁ గొలిచి,
స్వర్గతిని గోరుదురు; వారు స్వర్గమందు
నమరు భోగాలు, పుణ్యులై యనుభవింత్రు ॥ 20

వార, లావిశాలమ్మగు స్వర్గలోక
మను భవించి, పుణ్యము క్షీణమయి, మనుష్య
లోకమును బ్రవేశింతు; రిట్లుగఁ ద్రయీ ప
థమునఁజరియించువార లర్థముల కాము
లగుచు, రాకపోకలను నల్లాడుచుంద్రు ॥ 21

ఏ యితరునెడను మనస్సొకింత లేక,
ఏ జనులు నన్నెశ్రద్ధతోఁ బూజ సేతు,
రట్టి నిత్యాభియుక్తులదైన యోగ
మును గురించి క్షేమము వహింతును, కిరీటి ! 22

ఎవ్వరైన, భక్తులు శ్రద్ధ నివ్వటిలఁగ
నన్యదేవతల యజింప, అట్టివారు,
అవిధిపూర్వకముగ నన్నె, అర్జునా! య
జింతు రంత శ్రద్ధను గూడి, చిత్తమందు ॥ 23

అఖిల యజ్ఞమ్ములకుఁ బ్రభువైననేను
భోక్తనుంగూడ; ఐనను, బూర్తిగనను,
తత్త్వమును నెఱుంగఁగలేరు; దానిచేత,
ప్రచ్యుతిని జెందుచున్నారు వారు, పార్థ ! 24

దేవతలను దేవవ్రతుల్ తివిరి చేర,
పితరులను జేరుదురు పితృవ్రతులు కొలచి;
భూతములను భూతేజ్యులు పొందుచుంద్రు;
నను యజించెడు వార లందఱును, నన్ను ॥ 25

పత్రమొ, సుమమ్మొ, తోయమ్మొ, ఫలమొ, యేదొ,
యెతఁడొ భక్తితో నాకు నర్పించుఁగాక,
అద్ది, ప్రయతాత్ముఁడు సభక్తి నర్పణమ్ము
చేసినది నేను బ్రీతితో స్వీకరింతు ॥ 26

ఏది చేతువొ, తిందువో, యేది నీవు,
ఏది హవనమొ, దానమ్ము నేది యగునొ,
ఏయది తపస్సొ, యవ్వాని నెల్ల, పార్థ !
అర్పణము చేయుమా నాకు నంచిత మతి ॥ 27

ఇట్టివి శుభాశుభఫలా లవెన్నియైనఁ
గర్మబంధాల నుండి మోక్షమ్ము కలుగు;
అల్లసంన్యాస యోగ యుక్తాత్ముఁడవయి,
ముక్తుఁడవయి, పిదప, నన్ను బొందఁగలవు ॥ 28

సముఁడనేను సమస్త భూతముల యెడను;
లేదు ద్వేష్యము నాకేది; లేదు ప్రియము;
కాని, భక్తితోనను గొల్తురేని, యెవ్వ
రేని, వారిలో నేను, నాలోన వారు ॥ 29

అతిదురాచారుఁడైన, ననన్య భక్తి
నన్ను సేవించునేని, మంతవ్యుఁడతఁడు,
సాధువుగ; ఏల యనఁగ, నిశ్చయపుబుద్ధి
లెస్సగఁగలట్టివాఁడౌట, లెక్కచేయ ॥ 30

త్వరగ ధర్మాత్ముఁడగును నాతండు; మఱియు,
శాశ్వతపు శాంతి నందంగఁజాలుఁగూడ;
తెలియు మిది సత్యమనుచు, కౌన్తేయ! నాదు
భక్తుఁడు నశింపఁబోవఁ డెప్పటికి నేని ॥ 31

ఎందుచే నన, నన్నాశ్రయించి, పార్థ !
ఎవరు, స్త్రీలు, వైశ్యులు, శూద్రు, లెల్లపాప
యోను లున్నారొ ధరణి, ఆయున్నవారుఁ
గూడ, పరమగతిని జేరుకొనఁగలారు ॥ 32

బ్రాహ్మణులు, పుణ్యు లౌవారు, రాజ ఋషులు,
భక్తు, లట్టులే యని వేరె వచనమేల ?
అసుఖము, అనిత్య, మీలోక; మందుఁ బుట్టి
నాఁడవు; కనుక, సేవింపు నన్ను, పార్థ ! 33

నాయెడ మనస్సు, భక్తియు నాయెడ నయి,
నను యజించుచు, నమసులు నాకు నిడుచు,
పరము నేనని, యుక్తుండ వగుచు నాత్మఁ,
బొందెదవు నన్నె; లే దెట్టి సందియమ్ము ॥ 34

ఇటులు
రాజవిద్యారాజగుహ్యయోగము
పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదవ అధ్యాయము
### విభూతి యోగము

శ్రీ భగవానుఁడు : అనును
నాదు వాక్కున్నఁ బ్రియమైన నీదుహితమ
కోరియే నేను నీకు వాక్రుచ్చుచుంటి
నే పరమ వచనమును, దానిఁ దిరిగి విను,
ఓ మహాబాహు! మేటి మే లొందఁగలవు ॥ 1

నా ప్రభవమును సురలగణాలు తెలియ
లేవు; కారు మహాఋషులేని తెలియ;
ఏలనఁగ, సురలకు, మహాఋషుల, కేనె
సర్వ విధముల, ఆది, ఓ సవ్యసాచి ! 2

ఎవఁడజునిగ, అనాది మహేశ్వరునిగ
నను దెలిసికొను చున్నాఁడొ జనుల యందు
అతఁ, డసమ్మోహుఁ, డగుటచే, నన్ని పాప
ములను విడచి; విముక్తుఁడై, వెలయఁగలఁడు ॥ 3

బుద్ధియును, జ్ఞానమును, అసమ్మోహ మదియు,
క్షమయు, సత్యమ్ము, దమమును, శమము కూడ,
సుఖము, దుఃఖమ్ము, పొడముట, శూన్యమగుట,
భయము, మఱి, దానితోడ, అభయమును, మఱి ॥ 4

సమతయును, బెగ, ఆయహింసయును, తుష్టి,
తపమును, యశమ్ము, అయశమ్ము, దాన మదియు,
భూతభావమ్ము లియ్యవి పొడము చుండు
పలువిధాల నావలననే, పాండవేయ ! 5

ఆరునొక మహర్షులు, పూర్వమందలి నలు
వు, రటు, మనువులు, మద్భావు లరయ; మనసు
చే జనించిరి; వారలచేత నెల్ల
భూతములు లోకమందిందు పొడమ సాగె ॥ 6

ఈ విభూతి యోగమ్ములు నావి, వీని
తత్త్వము నెవండు తెలియు నతండు, పార్థ !
స్థిరపడెడు యోగమునఁ జెక్కు చెదరకుండ;
దీని గూర్చి సంశయమొకింతేని లేదు ॥ 7

నేను సర్వమ్మునకు మూలమైనవాఁడ;
సర్వమును బ్రవర్తించు నాశక్తి వలన;
అనుచు, భావసమన్వితులగుచు, బుధులు
ననుభజించుచు నుండెద రనవరతము ॥ 8

నాయెడను జిత్తముంచి, ప్రాణముల నాకు
నిడి, పరస్పర బోధలఁ గడఁగుచుండి,
నా కథలు చెప్పుకొనుచు సంతతము, పార్థ !
తృప్తి నందుచుఁ గ్రీడలఁదేలు చుంద్రు ॥ 9

ప్రీతిపూర్వకముగను సేవించు చుండి,
సతతయుక్తులై, మించు నా జనులకేను,
దేనిచేవారు నను జేర నౌనొ దాని,
బుద్ధి యోగమ్మును ప్రసాదముగను గూర్తు ॥ 10

వారిలోనుండి, యాత్మభావమ్ము పొంది,
కేవలమ్మనుకంపతో, పోవఁజూతు
వారి యజ్ఞాన జ తమమ్ముఁ, బ్రభఁజెలంగు
జ్ఞానదీపమ్ము తోడుగా నేను, పార్థ ! 11

అర్జునుఁడు : అనును
పరమమగు బ్రహ్మ, మఱి, నీవు పరమగతియు
పరమ పురుషుండు, మఱియు, శాశ్వతుఁడు, విభుఁడు,
దివ్యుఁడు, పవిత్రుఁడును, ఆదిదేవుఁ, డజుఁడు,
అని వశిష్టాది ఋషులెల్ల ననుచు నుంద్రు ॥ 12

అటులె, దేవర్షి నారదుఁడైన ననెడు,
అసితుఁడును, దేవలుఁడు, మఱి, వ్యాసఋషియు,
పేరు గన్నాఁడు వేదాల విభజనమున,
స్వయముగా నాకు నీవేది పలుకు దదియె ॥ 13

ఏది నాకయి పల్కెదొ, కృష్ణ ! నీవు,
ఆసమస్తమ్ము ఋతమని యాత్మఁదలఁతు ;
తెలిసికొనలేరు నీవ్యక్తి దేవతలును,
దానవులు కూడ; ఎవరి కందవు గదయ్య ॥ 14

నిన్ను నీచేత, స్వయముగ నీవు తెలియఁ
గలుగుదువు, పురుషోత్తమా! వెలుగుకొలఁది;
భూతభావన! భూతేశ ! భువన పూజ్య !
దేవదేవ! జగత్పతీ! దివ్యమూర్తి ! 15

ఏ విభూతులచేత నీ వీసమస్త
లోకములను వ్యాపించి వెల్గొందు చుంటి,
వా విభూతుల, దివ్యమ్ము లైన వానిఁ
దగుదు వర్ణింపఁగ నశేషముగను, కృష్ణ ! 16

నిను నిరంతర ధ్యానమ్మునను నెఱుంగు
టెటులు, యోగీశ్వరా ! నేను ? ఎట్టి యెట్టి
భావముల నీవు చింతింపఁబడఁగవలెను
నాహృదయమందు, భగవంత ! నాకు చెపుమ ॥ 17

నీ విభూతిని, యోగమున్, దిరుగఁజెప్పు
విస్తరించి, జనార్దనా! వినఁగ వాంఛ;
ఎందుచే నన, అమృతమ్ము నెంతవినిన,
తృప్తి కలుగదుగా నాకొకింత యేని ॥ 18

శ్రీ భగవానుఁడు ఇఅనును
మంచిదియె, కురుశ్రేష్ఠమా! మంచిది, సఖ!
ముఖ్యమౌ విభూతులను చెప్పుదును నీకు
దివ్యమగు వాని నిప్పుడు, తృప్తి పొసఁగ;
నాదు విస్తారమున కేది లేదు తుదియె ॥ 19

అఖిలభూతాశయస్థితమైన యాత్మ
నేనసూ, గుడాకేశ ! ఈ నేనె యాది
నౌదు భూతమ్ములకు; అన్నిటందు మధ్య
నగుదు; అంతమ్ముకూడను నగుదు నేను ॥ 20

తెలియు మేను విష్ణుండ నాదిత్యులందు;
జ్యోతిషుల నంశుమంతుఁడైయున్నరవిని;
అలమరుత్తులను మరీచి నగుదు నేను;
శశి నగుదు నేను సకల నక్షత్రములను ॥ 21

వేదములయందు ఆసామవేదమేను;
వాసవుఁడనేను సర్వదేవతల యందు;
ఇంద్రియమ్ముల నయ్యెదనేను మనసు;
చేతన మ్మేను తలపఁగ భూతములను ॥ 22

రుద్రులం దయ్యెదను శంకరుండు నేను;
యక్షరాక్షసుల, కుబేరుఁడగుదు నేను;
వసువులందెల్ల నేను పావకుఁడ నగుదు;
ధారుణీ ధరములయందు మేరు వౌదు ॥ 23

నను తెలియుము బృహస్పతిగను, పురోధ
సులను ముఖ్యుండనగుదు, ఓ యలఘుగుణుఁడ !
నేను స్కందుఁడగుదును సేనానులందు;
సరసులందెల్ల అగుదు నే సాగరమ్ము ॥ 24

భృగుఁడుగ మహర్షులందెల్ల నేన యగుదు;
ఒక్కటే యక్షరమ్మోదు వాక్కులందు;
యజ్ఞములయందు నే జపయజ్ఞమగుదు;
స్థావరముల నగుదు హిమాచలము నేను ‖ 25

సర్వవృక్షమ్ములందు అశ్వత్థమేను;
ఏను నారదుఁడను దేవఋషుల యందు;
చిత్ర రథుఁడ గంధర్వుల చింతచేయ ;
కపిలముని నేను సిద్ధుల గణన చేయ ‖ 26

అశ్వములను ఉచ్చైశ్శ్రవ మగుదు నేను,
అమృతమందుద్భవమ్మైన దనుచు తెలియు;
ఎన్న ఐరావతమును గజేంద్రములను;
నరులను నరాధిపుఁడ నేను పరగ నగుదు ‖ 27

ఆయుధములందు వజ్రమ్ము అగుదు నేను;
ధేనువుల అయ్యెదను కామధేను వేను;
ప్రజనములను కందర్పుఁడై పరగు దేను;
వాసుకి అగుదు నేను సర్పములలోన ‖ 28

నాగములలోన అగుదు అనంతుఁ డనఁగ;
యాదసులలోన వరుణుండ అగుదు నేను;
అర్యముఁడు పితృదేవతలందు నేను;
యముఁడు నయ్యెద నేను సంయములయందు ‖ 29

అగుదు దైత్యుల నేను ప్రహ్లాదుఁడనఁగ;
ఏను సింహమ్మునగుదును మృగము లందు ;
వైనతేయుండు నగుదును పక్షులందు;
కలయతుల యందు అగుదును కాలమనఁగ ‖ 30

పవతులందు నేనగుదును పవనుఁడనఁగ;
శస్త్రభృతులందు నేను దాశరథి అగుదు;
ఝషము లందున మకరమై సొగుదేను;
జాహ్నవిగ పరగుదు స్రోతసములయందు ‖ 31

సృష్టులం దాది అగుదును నేనె, మధ్య
అగుదు, తుట్ట తుదయుఁగూడ అగుదు నేను ‖
విద్యలందేనె అధ్యాత్మ విద్య అగుదు ;
వాదములయందు అయ్యేద వాదమేను ‖ 32

అక్షరముల అకారమ్ము నగుదునేను;
ద్వంద్వము సమాసములయందుఁ దలఁప నేను;
ఏది అక్షయకాలమ్మొ, ఏన యదియు;
విశ్వతోముఖధాతను విశ్వమందు ‖ 33

ఏను సర్వమ్ము హరియించు మృత్యు వగుదు;
భావి పొడముటకైన యుద్భవము నేను;
స్త్రీలలో శ్రీయు, వాక్కు, కీర్తియును, మేధ,
స్మృతియు, ధృతియును, క్షమయును, నేనె అగుదు; 34

అటులె, సామమ్ములను బృహత్సామ మేను;
ఛందముల యందు గాయత్రి ఛందమేను;
మార్గశీర్షమ్ము అగుదును మాసములను;
ఋతువులందెన్నఁగ వసంత ఋతువు నేను ॥ 35

మొఱగు నరులందు జూదమై వఱలు దేను;
తెలియు తేజస్విసులయందు తేజమేను;
నేనె జయమును; నిశ్చయమ్మేనె యగుదు;
సత్త్వవంతుల సత్త్వమ్ము సర్వ మేను ॥ 36

వాసుదేవుఁడగుదు వృష్ణి వంశజులను ;
పాండవుల ధనంజయుఁడ, ఓ పార్థ ! నేను ;
మునులయందగుదును వ్యాసముని యనంగ ;
కవులయం దగుదు ఉశనాకవి యనంగ ॥ 37

దమయతు లొసంగు శిక్షలో దండమేను ;
నీతియగుదు జిగీషుల నేను వెలిసి ;
అగుదు మౌనమ్ము నేను గోప్యమ్ము లందు;
జ్ఞానవంతులయందలి జ్ఞానమేను ॥ 38

అటులె, సర్వభూతమ్ములకైన బీజ
మెదియొ, అర్జునా ! అగుదు నయ్యదియు కూడ;
ఈ చరాచరములయందు నేను లేక
ఉండఁగల భూతమొండేని యుండఁ బోదు ॥ 39

నాదు దివ్యవిభూతుల కేది లేదు
తుద యనుచు, పరంతప ! కాన, ఇది తలంచి,
చెప్పఁ బడినది నాచేత, ఇప్పు డీవి
భూతి విస్తరణమ్ము, ఓ పుణ్య పురుష! 40

సత్త్వమేదైనఁగాని, ఉత్సాహవంత
మో, విభూతి మంతమ్మొ, శ్రీ యుతమొ, యైన,
సత్త్వమది నాదు తేజోంశ జనిత మనియె
తెలిసికొను మీవు, కౌన్తేయ! దేనినైన ॥ 41

లేద, విపులముగను నిటు లివ్వి తెలియ
నేమగుఁ బ్రయోజనము నీకు, హే కిరీటి !
ఈ సమస్త జగత్తును నేనొకేయొ
కటగునంశచే నరికట్ట నిటుల లీల ॥ 42

ఇటులు
విభూతి యోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునొకొండవ అధ్యాయము
### విశ్వరూప దర్శన యోగము

అర్జునుఁడు : అనును
నన్నను గ్రహించుటకయి యెన్న నీవు
పరమ గుహ్య మధ్యాత్మమై పరగుదాని
దేని గూర్చి పల్కితివొ యద్దాన నాదు
మోహ మెల్ల నిదె తొలంగి పోయె, కృష్ణ ! 1

అటులె, కమల పత్రాక్ష ! నే నాలకించి
నాఁడ భూత జాలపు సృష్టి నాశనముల
గూరిచి సవిస్తరము నీవు కోరి పలుక;
అవ్యయ మగు నీ మహాత్మ్య మదియుఁగూడ ॥ 2

నిన్నును గురించి యేమిగ నీవు పలుకు
చుంటివొ యటులె యయ్యది, ఓ యనంత !
కాని, పురుషోత్తమా ! కండ్లఁ గనెడు వాంఛ
యున్నది స్వరూప మున్నది యున్నయటుల ॥ 3

కనఁగ నాకది సాధ్యమ్ము కాఁగలదని
తలఁచితేని నీదు మదిని, జలజనేత్ర !
అపుడు, యోగేశ! అవ్యయమ్మైన నీ స్వ
రూపమును నేను జూడంగఁ జూపు మీవు ॥ 4

శ్రీ భగవానుఁడు : అనును

పార్థ! నానా విధాలు దివ్యమ్ములౌచు,
వివిధ వర్ణము, లాకృతుల్ వివిధ మౌచు,
వందలును వేల సంఖ్య రూపమ్ము లౌచుఁ;
బరఁగు నారూపముల నెల్ల నరసి చూడు ॥ 5

చూడు మాదిత్యుల, నటు, వసువుల నెల్ల;
అశ్వినుల, మరుత్తుల, రుద్రులందరనొగిఁ,
జూడుమ అదృష్ట పూర్వముల్ చోద్యమైన
వానిఁ; జాలఁగఁ గల; వన్ని, పార్థ ! చూడు ॥ 6

అర్జునా! చూడు నాదు దేహమ్మునందు
ఇప్పుడొకచోట నిండిన యీ జగత్తు,
చరము నచరమ్ము; నేవి యితరములఁగన
వాంఛయున్నదొ నీకు, నవ్వానిఁ గూడ ॥ 7

కాని, యీ నన్ను జూడ శక్యమ్ము కాదు
నీప్రకృతి నేత్రములకు నెన్ని విధములను;
నీకు నొసగెద నొక దివ్యనేత్రమిపుడు
నాదు నైశ్వరశక్తిఁ, గన్నారఁ గనుము ॥ 8

సంజయుఁడు: అనును

ఈ విధము పల్కి, పిదప, యోగేశ్వరుండు
హరి, కిరీటికై, పరమమ్ము, నైశ్వరమగు
రూపమును, కౌరవాధీశ! చూపినట్టి
యాతఁడయ్యెఁ గురుక్షేత్రభూతలాన॥ 9

వక్త్రనయనాలు లెక్కకపారమగును;
అద్భుతపు దర్శనములు సంఖ్యకును మించి,
ఆభరణములు దివ్యమ్ము, లవియుఁబెక్కు,
లుద్యతాయుధములు దివ్యమున్న వెన్నొ ‖ 10

దివ్యమాల్యాంబరధరమద్దియును, రాజ!
దివ్యగంధానులేపనదీప్త మద్ది;
దేవ,మాశ్చర్యమయము సర్వావని నది ;
అగును విశ్వతోముఖము, ననంత, మద్ది ‖ 11

ఒక్కసారిగ వేయి సూర్యులది కాంతి
వినుతలమ్మున తాన్ బయల్వెడలెనేని,
ఆ మహాత్ముని కాంతితో నట్టి కాంతి
తుల్యమయి, తూఁగఁగలదొ, లేదో, యెఱుంగ ‖ 12

అపు,డనేకముగ విభక్త మౌచునున్న
యా సమస్త జగత్తుల మా మహాత్ము
దేహమునను నేకస్థమై తేజరిలఁగఁ
బాండుపుత్త్రుండు చూచె దిగ్భ్రాంతి తోడ ‖ 13

చూచి, కడు విస్మయావిష్టుఁడౌచు, హృష్ట
రోమములతోడ నొప్పి, పార్థుండు, తాఁ, గృ
తాంజలిగ నమస్కృతు లిడి, తలను నొగ్గి,
దేవునకుఁ బల్కె నిటులఁ గీర్తించు చుండి ‖ 14

అర్జునుఁడు : అనును
దేవ! నీ మెయిఁ గనెదను దేవతలను;
సర్వభూతవిశేషాలసంఘమదిగో;
ఈశుఁడు, జలజస్థుఁడు, బ్రహ్మఋషులు, వారె,
దివ్యులందఱు; ఉరగులుఁ దెలియ, వారె ॥ 15

బహుళసంఖ్య బాహూదర వక్త్రనేత్ర
ముల, ననంతరూపములను, గలుగునిన్ను
నెల్లెడను జూచుచున్నాను; ఇల్ల, యాది;
మధ్యయును, నంత,మిల్ల, బ్రహ్మమ్ము మూర్తి ॥ 16

గద, కిరీటమ్ము, చక్రమ్ము, కలుగువాని,
దీప్తిమంతుఁ, దేజోరాశి, దిశలనిండు
దుర్నిరీక్ష్యు, అర్కానల ద్యుతుని, జూతు
అప్రమేయు, విశ్వేశ్వరు, అచ్యుత! నిను ॥ 17

పరమ వేదితవ్యుఁడగు నక్షరుఁడ వీవ,
విశ్వపరమనిధానమీవే తలంప;
క్షమ, సనాతన ధర్మరక్షకుఁడ వీవ;
అవ్యయుండును, శాశ్వతుఁ, డగుదు వీవ ॥ 18

ఆదిమధ్యాంతశూన్య ! అనంతవీర్య!
ఆకరము లెన్నొ? శశిసూర్యులే కనులగు
వాఁడవీవు; దీప్త హుతాశ వక్త్రుఁడవును;
నీదు తేజస్సునఁ దపించు నీ జగత్తు ॥ 19

భూనభోంతరమును దిశల్ పూర్ణముగను
నీవొకఁడవు వ్యాపించి యుండిన కతాన,
అద్భుతోగ్రస్వరూపమ్మునట్టినీది
కాంచి, వణకు ముల్లోకముల్ కడు, మహాత్మ ! 20

నినుప్రవేశించు నిదె సురగణము లెన్నొ;
బెదరి, చేమోడ్పుల స్తుతించు వేఱొకతెగ;
"స్వస్తి!" యంచు, ఋషులు, సిద్ధ సంఘములును,
నిను స్తుతింతురు, స్తుతుల నెన్నిఁటినొచేసి ॥ 21

ఉన్నరుద్రు, లాదిత్యులు, నున్నవసులు,
విశ్వదేవతలును, సాధ్య, లశ్వినులును,
అలమరుత్తులు, మఱి, యూష్మపులును, సురలు,
యక్షగంధర్వసిద్ధులు, అసురగములు
అందరును నిన్నె విస్మితు లౌచుఁ గంద్రు ॥ 22

ఓ మహాబాహు! నీ రూపమున్నదెంతొ;
పెక్కుముఖములు, నేత్రముల్; పెక్కుపొట్ట;
లూరువులు పెక్కు; పాదాలు, నున్నవెన్నొ;
బాహువులు, దంష్ట్ర, లెన్నొయొ, పరిగణింప;
నీకరాళరూపముఁ జూచి, లోకవితతి
వణకు చున్నది; నేనును వణకు చుంటి ॥ 23

నభము స్పృశియించి, వివిధవర్ణమ్ములొప్ప,
దీప్తమై, వ్యాత్తముఖమయి, దీప్తములు వి
శాలములు నేత్రములు నయి, కాంతిలు నిన్నుఁ
గాంచి, యంతరాత్మవ్యథను గలఁగి, ధృతియు
శమము లేకుంటి సుంత, కేశవ ! అనంత ! 24

ప్రళయ కాలాగ్ని సన్నిభ వదనములఁ, గ
రాళ దంష్ట్రలఁ, జూచి, శర్మము లభింప
కయును, దిశలెఱుంగకయును, గలఁగి యుంటి,
కావుమా, దేవదేవా! జగన్నివాస ! 25

ధార్తరాష్ట్రుని పుత్త్రు లందఱును వీరు;
అవనిపాలసంఘములతో, నదిగో! నిన్నుఁ
గూర్చి, భీష్మండు, ద్రోణుండుకూడ, సూత
పుత్త్రుఁడట్టులే, మాయోధ ముఖ్యులెల్ల ॥ 26

తత్తరత పొంది, వికృతపు దంష్ట్రలెసఁగి,
భయము గొల్పుచు నున్న నీవక్త్రములను
జొచ్చుచున్నారు; కొందరు, చూర్ణమైన
తలలతో, దశనాంతరములకు మధ్య
చిక్కువడి, యదే కానుపించెడిని చూడ ॥ 27

నదుల నీటిప్రవాహమ్ము లుదధివైపె
యెదురుగా ప్రవహించెడు నెటులొ, యటులె
నీయ భిజ్వల వక్త్రాలనేప్రవేశ
మొందుచున్నార లీవీరు, లున్నవారు ॥ 28

ఎటులు దీప్తాగ్ని దూకు సమృద్ధ వేగ
మునను మిడుత లాత్మవినాశమునకుఁ గాఁగ,
అటులె లోకమ్ము లాత్మనాశార్థమే, స
మృద్ధవేగమ్ముతోఁ, జొరు నీముఖాల ॥ 29

అంతయును నిండి, మండెడు నా ముఖాల,
లోకముల మ్రింగుచును నీవు నాకుచుంటి;
విష్ణు ! నీయుగ్రకాంతులు, విశ్వమెల్ల
నింపి తేజస్సుచేఁ, దపియింపఁజేయు ॥ 30

ఉగ్రరూపమ్ము; నాకెవరో వచింపఁ
గదవె; దయచూపు, హరి! నమస్కారము లివె;
ఆద్యమగు నిన్ను దెలియంగ నాసపడుదు;
తెలియలేకుంటి నీప్రవృత్తిని నాకింత ॥ 31

శ్రీ భగవానుఁడు : అనును
కాలుఁడను నేను; లోకముల్ క్షయమొనర్చు
వృద్ధుఁడను; లోకములను నశింపఁజేయు
వృత్తి నాయది; లేకున్ననేని నీవు,
ఎవరుప్రత్యనీకఁపు యోధు లిచటఁగలరొ,
వారలెవ్వరుఁ బ్రదికెడువారు కారు ॥ 32

అందుచే, నీవు, లే; లెమ్ము; యశము గనుము;
శత్రుల జయించి, రాజ్యమ్ము సర్వముఁగొను;
వారు నాచేతిలోనె, పూర్వమ్మె, హతులు;
కాఁగదె నిమిత్తమాత్రుండుగా, కిరీటి! 33

ద్రోణుఁడును, భీష్ముఁ, డల్ల కర్ణుఁడును, మఱి,జ
యద్రథుండును, నట్టులే, యన్యులైన
యోధులును మున్నెహతులు నాచే ధరిత్రి;
నీవు చంపుము; భయపడకీవు; పోరు
మా; రణమ్మునను జయింపు, మయ్య! రిపుల ॥ 34

సంజయుఁడుః అనును
కేశవుని వాక్యమిది యాలకించి యిటుల,
వణకుచును, గృతాంజలియయి, పాండుసుతుఁడు
మఱిమఱి నమస్కరించి, యా మాధవునకు,
భీతుఁడై, గద్గదను, నమ్రవిధిని బలికె ॥ 35

అర్జునుఁడు : అనును
సరియ, గోవింద! కీర్తించి జగతి నిన్ను,
తోషమును జెంది, యనురక్తితోఁజెలంగు ;
రాక్షసులు భీతి దిశలఁ బారంగనెరి;
సిద్ధసంఘాలు చే మోడ్పు చేయుదు, రదె ॥ 36

బ్రహ్మకును నాది కర్తవై పరగు నీకు
ఏల మ్రొక్కరు ఘనునకు, హే మహాత్మ!
స, త్తసత్తు, తత్పరుఁడ, వక్షరుఁడ,వీ,వ
నంత! దేవేశ! జగమ్మెయిల్లైనవాఁడ ॥ 37

ఆదిదేవుండ! పురుష! అనంతరూప!
ఈవె పరమ నిధానమౌ దీజగతికి ;
నీవె వేత్తయు, వేద్యమ్ము; నీవె పరమ
ధామ; మీవె వ్యాపించి తేత జ్జగత్తు ॥ 38

వాయువు, యముండు, శశి, యగ్ని, వరుణుఁడును, బ్ర
జాపతి, ప్రపితామహుఁడీవ; సర్వ్వలీవ;
అగుత నీకు నమసులు సహస్రములుగ;
మరల, మరల, నీకగుత నమశ్శతాలు ॥ 39

ఎదురు వెన్కల నుండి నీకే నమస్సు;
ఎల్లదెసల నుండియును నీకే నమస్సు;
వీర్యమ? అనంత; మమితమ్ము విక్రమమ్ము;
సర్వమాక్రమించితివీవు; సర్వమీవు ॥ 40

సఖునిగఁ దలంచి, ప్రసభాన, సఖుఁడ! కృష్ణ
యాదవా! యని, మహిమ నీయది యెఱుంగ
లేక, నాప్రమాదముచేత, లేద, ప్రేమ
నైన, నేమేమి పల్కియున్నాఁడనొ గద ॥ 41

ఒంటరిగనో, పరులతోనొ, యుండనీవు,
శయ్యల, విహారములను, భోజనమువేళ,
నన్నుగూడి కూర్చుండఁగ, నవ్వులకు, న
గౌరవపరచితినొ యెట్టికాని రీతి,
అచ్యుతా! నన్ను క్షమియింపు మందుల కయి;
అప్రమేయుని, నిను, జేతుఁ బ్రార్థనమ్ము ॥ 42

ఈచరాచరలోకాన కీవు పితవు;
పూజ్యుఁడవు; గురులకు గురుమూర్తి వీవు;
నీకు సముఁడిల్ల; అధికుండు నీకు ఎటులు?
అనుపముఁడ వీవు లోకత్రయమ్మునందు ॥ 43

కాన, నొడ లొగ్గి, నా నమస్కారమిడెద
నీ ప్రసాదార్థ మీశుని నిన్ను, నీడ్యు;
కొమరు జనకుండు, సఖుని సఖుండు, ప్రియుని
ప్రియుఁడు వలె, సహింపఁ దగుదు వీవు, దేవ ! 44

చూడనిది పూర్వ; మిపుడేను చూచి, మురియు
వాఁడ; నామది క్షోభిల్లు భయముచేత;
దర్శనమ్మిమ్ము రూప మద్దానినె, పర
మేశ్వర! అనుగ్రహింపు, ఓ కృష్ణదేవ ! 45

ఆ కిరీట, మాగద, చక్రహస్త, మల్ల
పూర్వమటు నిన్ను నేఁజూడఁ, బొసఁగు వాంఛ;
నీచతుర్భుజ రూపమ్ము నేకనంగ
నగుమ, విశ్వమూర్తీ! ఓ సహస్ర బాహు ! 46

శ్రీ భగవానుఁడు : అనును
ఒరుఁడు చూడంగలేదు నీవొండు తక్క,
ఆద్యము, ప్రకాశమాన, మనంతము, మఱి,
విశ్వ, మీ పరం రూపమ్ము; వితతమైన
యాత్మమాయచేఁ జూపింపనైతి నీకు,
నీ యెడఁ బ్రసన్నుఁడను గాన నేను, పార్థ ! 47

నీకు నొకనికిఁదక్కన, ఓ కురువర!
నరుల నొరునకు నెవనికి నన్ను నిట్టి
రూపమునఁ జూడ శక్యమా యే పగిదిని ?
వేదయజ్ఞాధ్యయనములు, వివిధక్రియలు,
ఘోరతపములు, దానముల్ కూడఁదగవు ॥ 48

వలదు వ్యథనీకు, మూఢ భావమ్ము వలదు,
ఇట్టి యీ ఘోరరూపమ్ము దృష్టి చేసి;
భయము పోయి, ప్రీతిమతి, రూపమ్ము, దాని
నే, యిదిగొ, చూడుము, తిరిగి, నీవు, పార్థ ! 49

సంజయుఁడు : అనును

అర్జునునితోడఁ గృష్ణుఁ డట్లనినరీతి,
స్వీయ రూపమ్ము మరలఁ జూపించె నపుడు;
తిరిగి, సౌమ్యదేహము తాల్చి దేవవరుఁడు,
భయపడినవీని నోదార్చె, భరతవృషభ ! 50

అర్జునుఁడు : అనును

చూచి, యీ నరరూపమ్ము, చూచి, నీదు
సౌమ్యరూపమ్ము, సరసి జాక్షా! మహాత్మ !
బ్రదికినాఁడను నిపుడేను; మదియుఁగుదుట
బడి, స్వభావస్థితిని బొందె, పరమ పురుష ॥ 51

శ్రీ భగవానుఁడు : అనును

ఏ సుదుర్దర్శరూపమ్ము నిపుడు నాది
కనఁగలిగినాఁడవైతివో కనుల, పార్థ !
దేవతలు కూడ నారూప దివ్య దర్శ
నమ్ము నిత్యమ్ము కాంక్షింత్రు సుమ్ము హృదిని ॥ 52

నన్నెటులు నీవు చూచి యున్నాఁడ, వట్టి
విధముననె చూడ శక్యమౌ విధము లేదు
నన్ను; వేదముల్ చాలవు నన్ను జూప;
చాలవు తపమ్ము, దాన యజ్ఞమ్ములైన ॥ 53

కాని, యేకాంత భక్తిచే, నేను శక్య
మగుదు ఈ విధమ్మున, అర్జునా! నిజమ్ము;
తత్త్వము నెఱుంగ మదిని, నేత్రములఁజూడ,
ఆత్మనుప్రవేశమంద, ఓయనఘ! పార్థ ! 54

ఎవఁడు నా పనినేచేయు, నెవఁడు నన్నె
గతియనుచు నమ్ము, నెవఁడు సంగమ్ము విడచి
భక్తుఁడగు నాకు, భూతాల బంధు వెవఁడొ,
అతడు నన్నునే పొందు సుమ్మా, కిరీటి ! 55

ఇటులు
విశ్వరూప దర్శనయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పంద్రెండవ అధ్యాయము

### భక్తియోగము

అర్జునుఁడు : అనును

భక్తులిటు నిన్ను సతతమ్ము యుక్తులగుచు
ధ్యానమును జేయఁ, గొంద రవ్యక్త, మక్ష
రమ్మనగుని న్నుపాసింతు, రట్టిడులను
యోగవిత్తము లెవ్వరో, యోగనాథ ! 1

శ్రీ భగవానుఁడు : అనును

మనసు నాయందు లగ్నమై, యనుపమ మగు
శ్రద్ధతోఁగూడి, యెవ్వరు సతతయుక్తు
లగుచు న న్నుపాసింతురో, యట్టివారె
నాయెడల యుక్తతము లని నామతమ్ము ॥ 2

అయిన, సర్వత్రగ, మచింత్య, మచల, మై; ధ్రు
వమ్ము, కూటస్థ, మగుచు; నవ్యక్త మగుచు,
అక్షర, మ్మనిర్దేశ్యమ్ము, నగుచు; వెలయు
దాని నెవ రుపాసింతురో తత్పరతను ॥ 3

ఇంద్రియగ్రామమును నియమించి, మించి,
సర్వమునయందు సమబుద్ధి జరపి, జరపి,
భూతహితరతి మెలఁగు నప్పురుషులెవరొ,
పొందెదరు వారు నన్నునే పూతమతులు ॥ 4

అధికతరమగు క్లేశ మవ్యక్తమందు
సక్తచేతసులగు నట్టి సజ్జనులకు ;
దేహి కవ్యక్తమైన యాస్థితిని బొందఁ
గష్టమునఁగాని సుఖముగఁ గలుగదు గద ॥ 5

అటులు గాక, మత్పరు లౌచు, నఖిలకర్మ
ముల సమర్పించి, యెవ్వారు కొలుచువారొ
నన్ననన్యయోగస్థులై, నన్నె మదిని
ధ్యానమును జేయుచును నొందుతలఁపు లేక ॥ 6

వారలను నేను మృత్యు సంసార సాగ
రమ్మునందుండియె సముద్ధరణ మొనర్చు
వాఁడనగుదును, పార్థ! సత్వరితగతిని
నాయెడల సుస్థిరమనస్కులై యెసంగ ॥ 7

నీ మనసు నొక్కనాయందె నిలువనిమ్ము;
బుద్ధి నాయందునె ప్రవేశ మొందనిమ్ము;
పిమ్మటను నీవు నాయందె వెలయఁగలవు,
సంశయములేదు, పార్థ! సంశయము లేదు ॥ 8

అయిన, స్థిరముగ స్థాపింప నయిన శక్తి
లేదొ నీమది నాయందుఁ బాదు కొనఁగ,
అప్పు డభ్యాసయోగమ్మునండఁ గొనుచు,
నను, ధనంజయా! ప్రార్థించి, కనుమ నన్ను ॥ 9

ఆసమర్థత యభ్యాసమందు లేదొ,
పాండవా! నీవు మత్కార్మ పరుఁడ వగుము;
నా కొఱకుఁ గర్మలను జేసినపుడు కూడ
పొందఁగల వీవు సిద్ధి సంపూర్ణముగను ॥ 10

దీనికేని నీవుకానవో తగు శక్తిఁ,
గర్మయోగమునకుఁ గడఁగు దీక్ష;
నియతచిత్త వృత్తి నెగడి త్యాజ్య మొనర్పు
సర్వకర్మఫలము, సవ్యసాచి ! 11

జ్ఞాన మభ్యాసమున కంటె గణ్యము కద;
జ్ఞానమునకంటె శ్రేష్ఠమ్ము ధ్యానమనఁగ;
ధ్యానమెటుఁ గర్మఫలముల త్యాగమెదుట?
త్యాగమున శాంతి కలుగు నంతరము లేక ॥ 12

సర్వభూతాల యెడల ద్వేషమ్ము లేక,
మిత్ర భావమ్ముఁ గరుణయు మాత్ర మొప్ప,
క్షమిగ, సుఖ దుఃఖముల యెడ సమతఁబరగి,
"నేను, నా" దను భావముల్ నిలువనీక ॥ 13

సతతసంతుష్టుఁడు, దృఢనిశ్చయుఁడు, యోగి,
మనము, బుద్ధిని, నాకె యర్పణము చేసి,
భక్తుఁడైన యతాత్ముఁడెవ్వాఁడొ, యతఁడె
యోగవిత్తముఁ, డతఁడె నాకుర్విఁ బ్రియుఁడు ॥ 14

విసుగు చెందదు లోకమ్ము వేనివలన?
లోకమును గూర్చదెవని కుద్రేకమిందు?
హర్షమును, అమర్షమ్ము, భయమ్ము, కలఁత,
లుండని యతండె, అతఁడె అతఁడె నా కుర్విఁ బ్రియుఁడు ॥ 15

దక్షుఁడయి, శుచియయి, అనపేక్షుఁ డగుచు,
వ్యథవశుఁడుగా, కుదాసీనుఁడై యెసంగి,
పృథివిఁ గర్తృత్వమెల్ల పరిత్యజించి,
యుండు నే భక్తుఁడతఁడె నాకుర్విఁ బ్రియుఁడు ॥ 16

లేదు తోషమ్ము, ద్వేషమ్ము లేదెవనికి?
ఉన్నదను నేడ్పు, లేదన్న యూహ లేదు;
శుభము నశుభమ్ము నొకటిగాఁజూచు చెవ్వఁ
డుండు భక్తుల, అతఁడె నాకుర్విఁ బ్రియుఁడు ॥ 17

శత్రువో, మిత్రుఁడో, వారు సములెతనకు;
మానమో, అవమానమో, యవియు సమమె;
సముఁడు, సంగవివర్జితుం, డమలుఁ, డతఁడు
కష్టసుఖముల, శీతోష్ణకముల యందు ॥ 18

తుల్యమే, నిందయే గాని, స్తుతియె గాని;
లభ్యమగు నదే సంతృప్తి ప్రాప్తి నిడెడు;
మౌని, స్థిరమతి, వాంఛలు లేని యతఁడు,
భక్తిమంతుండు, నరుల నా పరమప్రియుఁడు ॥ 19

ఎవరు భక్తాళి శ్రద్ధతో నెనసి, నేనె
పరమగతిగఁ, జెప్పఁబడిన ఫణితి, ధర్మ్య,
మమృతమును, దీని, సేవింతు రమితముగను,
వారెసూ, ధనంజయ! నాకుఁ బరమ ప్రియులు ॥ 20

ఇటులు

భక్తియోగము పూర్తి.

# శ్రీ మద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదమూడవ అధ్యాయము

### క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

శ్రీ భగవానుడు : అనును
క్షేత్రమని యీ శరీరమ్ము చెప్పఁబడును,
వినుము, కౌన్తేయ ! ఎతఁడు దీనిని గ్రహించు,
అతని, క్షేత్రజ్ఞు డనుచును, ఆ విభాగ
ముల నెఱంగినవారు చెప్పుదురు సుమ్ము ॥ 1

అర్జునా! క్షేత్రముల నన్నిటందు నున్న
యట్టి క్షేత్రజ్ఞుఁడను నేనయనుచుఁ గూడఁ
దెలియు; క్షేత్రమ్ము, తజ్ఞుల, తెలివి యేదొ,
అదియ నా మతమ్మున జ్ఞాన మనఁగఁ బరఁగు ॥ 2

ఏది యాక్షేత్రము? స్వభావమేది? యే వి
కారములఁదాల్చు? దేనిచేఁ గలుగు నేది?
ఎవఁడతఁడు? తత్ప్రభావమ్మదేది? దాని
నావలన సంగ్రహమ్ముగనీవు వినుము ॥ 3

ఋషులచే, బహుభంగుల, నిద్ది వివిధ
ఛందములలోన, బహువిశేషముల తోడ
హేతువులు కల్గి, నిశ్చిత మేర్పరచిన
బ్రహ్మసూత్రపదమ్ములఁబాడఁ బడియె ॥ 4

అలమహాభూతములును, అహమ్మనునది,
బుద్ధియును, మఱి, యవ్యక్తమును, బదియు నొ
కండు నగు నింద్రియమ్ములు కలిసి, పైగ,
ఇంద్రియములకు గోచర మెవియొ యవియు ॥ 5

ఇచ్ఛ, ద్వేషమ్ము, సంహతి, ధృతియు, సుఖము,
దుఃఖమున్, చేతనముఁ జెప్పుదురుగదా యు
దాహరణముగ విదులు క్షేత్రమునకు సవి
కారమునకును, పార్థ! సంగ్రహము చేసి ॥ 6

వీకదంభాభిమానముల్ లేకయుంట,
క్షాంతి, ఆర్జవము, అహింసఁ, గలిగి యుంట,
స్థైర్య, మాచార్యసేవయు, శౌచ, మాత్మ
నిగ్రహమ్మును గుణములై నెగడుచుంట ॥ 7

రాగరాహిత్య మింద్రియార్థముల యెడల
అహము భావమ్ము కూడ శూన్యతను గనుట,
జన్మ మృత్యుజరావ్యాధిజనిత దుఃఖ
తతుల దోషాల నిత్యానుదర్శనమ్ము ॥ 8

సక్తి లేకుండుట, అనభిష్వంగుఁడగుట
పుత్త్రదార గృహాదులపొందు పట్ల,
ఇష్టము, లనిష్టములును, ప్రాప్తించు నప్పు
డన్ని వేళల సమచిత్తుఁడగుచు నుంట ॥ 9

నాయెడ ననన్య యోగమ్మున నగు భక్తి
చెక్కు చెదరకయుండుట యొక్కరీతి,
ఒక వివిక్త దేశముఁ గోరి, యుండుటయును
అరతిఁ జూపుట జనసమూహముల యందు ॥ 10

ఆత్మ విషయక జ్ఞాన నిత్యత్వ, మటులె,
తత్త్వ సంబంధమగు జ్ఞాన దర్శనమ్మ
జ్ఞానమని చెప్పఁబడెడు ఈ సకల మిద్ది;
అన్య మెది దీని, కజ్ఞానమనఁగఁజెల్లు ॥ 11

ఏది జ్ఞేయమొ యయ్యది యిపుడు చెపుదు;
ఏది తెలియ, అమృతము లభింపనగునొ;
అది, అనాదిమత్తును, పరమాత్మ; సత్తు
కాదనుచుఁబల్కుదు; రసత్తుకాదు కూడ ॥ 12

దానిపాణిపాదమ్మ లంతటను గలవు ;
దాని తల, కనులు, ముఖ, మంతటను గలవు;
దాని చెవులును లోకమంతటను గలవు;
అంతటను వ్యాప్తమై యున్నదద్ది యొకటి ॥ 13

ఇంద్రియ గుణమ్మ లొప్ప భాసించు నెల్ల;
ఇంద్రియ వివర్జితమ్మయి యెసఁగు మఱియు;
సర్వమును ధరించునది, అసక్తమైన;
నిర్గుణమె; కాని, గుణము లన్నిఁటిని బొందు ॥ 14

కలదు భూతాల వెలిని, లోపలను గూడ;
చరము కాదది; మఱియును, చరముఁ, గూడ;
అది అవిజ్ఞేయ మగు, సూక్ష్మమౌట కతన;
అద్ది దూరమ్ము; దగ్గరయగును గూడ ॥ 15

కాదది విభక్త, మటు విభక్తముగ భూత
ములను నుండియున్నను గూడఁ; దెలియఁదగును,
స్థితి సమయమందు భూతాలక్షితి భరించు;
మ్రింగు లయమప్డు; పుట్టించు సృష్టివేళ ॥ 16

జ్యోతులకుఁ గూడ నయ్యది జ్యోతియగును;
తమముకంటెఁ బరమ్ముగ దానినండ్రు;
జ్ఞానగమ్యమ్ము, జ్ఞేయమ్ము, జ్ఞానమద్ది;
సకలభూతమ్ములహృది సుస్థాపితమ్ము ॥ 17

ఇద్ది క్షేత్రమ్ము; జ్ఞానమ్ము నిటుల, జ్ఞేయ
సహితముగఁ జెప్పఁబడె నీకు సంగ్రహముగ;
దీని, నాభక్తుఁ డగువాఁడు తెలిసికొనుచుఁ,
బొందెడును నాదు భావమ్ము, పురుషవృషభ! 18

ప్రకృతియుఁ, బురుషుఁ, డనెడు నీద్వయముఁదెలిసి
కొను, మనాదులే యనుచును, అనఘమూర్తి !
గుణములను, వికారమ్ములఁగూడఁ దెలియు
ప్రకృతి సంభవములె యని, పాండవేయ ! 19

కార్యకరణాల కర్తృత్వకారణమ్ము
ప్రకృతి యనుచును జెప్పంగఁ బడుచునుండు;
నిటులె, సుఖదుఃఖ భోక్తృత్వహేతు వెన్నఁ,
బురుషుఁ డనుచును జెప్పంగఁ బరగుచుండు ‖ 20

ప్రకృతి యందున్న పురుషుండు ప్రకృతి జనిత
మగు గుణమ్ముల భుజియించు; నందుచేత,
ఈ గుణమ్ముల సంగమ్ము హేతు వగుచు,
జన్మము సదసద్యోనుల సాగుచుండు ‖ 21

భర్త, భోక్త, ఉపద్రష్ట, పలుకు తోడు,
ఆ మహేశ్వరుఁ, డలపరమాత్మ యనఁగ,
ఇందుఁ జెప్పంగఁ బడుచుండు ఈ శరీర
మందె కల పురుషోత్తముఁడైన యతఁడు ‖ 22

ఈ విధమ్ముగఁ దెలియంగ నెవఁడు నేర్చుఁ
బురుషు, గుణయుత ప్రకృతిని సరిగ, ఆతఁ
డే విధముగఁ బ్రవర్తించెనేనిఁ గూడఁ
తిరిగి పుట్టంగఁబోవఁడీ నరులయందు ‖ 23

తాము తమ్మాత్మ చేసెడు ధ్యానమునను
గొందరాత్మను దర్శించుచుందు రిచట;
అన్యులో, సాంఖ్యయోగమ్ము నభ్యసించి,
కర్మయోగమ్ముచేఁ గూడఁగనెద రొరులు ‖ 24

ఐన, నిది తెలియఁగలేని యన్యులేని,
అన్యులందుండి విన్నవారై భజింత్రు;
వారు శ్రుతి పరాయణు లౌచుఁ బరగుచుంట,
దాటుచునె యుండి రదె మిత్తి తాము కూడ ॥ 25

చరమొ, యచరమ్మొ, కించిత్తు సత్త్వమేది
యగుత, పుట్టెడు, క్షేత్రజ్ఞుఁ, డల్లక్షేత్ర
మును గలిసికొని నంతట, ననెడు దాని
తెలిసికొనఁగదె నీవు, పార్థివ ! నిజమ్ము ॥ 26

సర్వమగు భూతములును నాశనము కల్గి
యుండఁగా, నాశనము లేక, యుండు స్థిరత
సముఁడు, పరమేశ్వరుఁడు; వాని సమత, స్థిరత,
చూచునెతఁడిటు, లాతఁడే చూచునతఁడు ॥ 27

మఱియు, సర్వమ్మునందు సమమ్ము కాఁగ
కదలక, యెసంగు నీశ్వరుఁ గనెడు వాఁడు,
తనకుఁదా నెవ్వఁడును హింసఁదలపఁడుఁగద ;
అందుచే, నా పరమగతి నందు నతఁడు ॥ 28

ప్రకృతియె సమస్త విధముల పనులు చేయుఁ ;
గర్త యేమాత్రమును నాత్మ కాదటంచు,
రెండిఁటిని నెవ్వఁ డున్నట్టి రీతిఁ జూచు,
నతఁడె సరిగను జూచువాఁడనఁగ నొప్పు ॥ 29

భూతముల పృథక్ భావమ్ము పోయి, యెప్పు
డొకట నన్నియు నుండుట ప్రకటితమగు,
విస్తరణ దానినుండియె విశదమగును,
అపుడు తప్పక పొందు బ్రహ్మమ్ము నతఁడు ‖ 30

ఆదిలేకుంట, నిర్గుణ మగుచునుంట,
అవ్యయుం డితఁడీ పరమాత్మ, పార్థ !
దేహమున నుండి కూడ కౌన్తేయ ! చేయఁ
డెద్దియేనియు; మఱి, యంటదెదియుఁగూడ ‖ 31

సర్వగతము, సూక్ష్మము, నాకసమ్ము; దాని
నంటుకొనఁబోవ దెయ్యది; యటులు కాదె?
దేహమున నెల్లెడల నవస్థితము కాన,
ఆత్మనెయ్యది యేనియు నంటఁజనదు ‖ 32

భానుఁ డొకఁ డీసమస్త ప్రపంచమెటులు
కాంతిమంతమ్ము చేయంగఁ గలుగుచుండు?
క్షేత్రియును సమస్తమ్మైన క్షేత్రమటులె
శాంతిమంతమ్ము చేసెడుగా, కిరీటి ! 33

క్షేత్రమునకు, క్షేత్రజ్ఞున కిట్టి యంత
రమ్ము, భూతప్రకృతికి మోక్షమ్ము, నెవరు
జ్ఞాన నేత్రాలఁ దెలియంగఁ జాలు వారొ,
వారలు పరమ్ముఁ బొందెడువారు, పార్థ ! 34

ఇటులు

క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునాల్గవ అధ్యాయము

### గుణత్రయ విభాగ యోగము

శ్రీ భగవానుఁడుః అనును

మునులు సర్వమ్ము నెయ్యది బోధపడఁగ,
ఉన్నతస్థితి నిందుండి యొందఁ గనిరొ,
జ్ఞానములనెల్ల నుత్తమ జ్ఞానమైన
పరముఁ దెలుపుచునుంటిని దిరుగ దాని ॥ 1

జ్ఞానమయిన యిద్దాని యాశ్రయము చెంది
నా స్వరూపమ్ము పొంది యున్నారు వారు ;
సృష్టి వేళనునైన జనింపఁ బోరు ;
ప్రళయ మప్పుడు కనఁబోరు వ్యథనొకండు ॥ 2

నాదు యోని మహద్బ్రహ్మనాఁ బరంగు ;
దాని యందునె గర్భమ్ము నేన యిడుదు;
సర్వ భూతాల దైన యా సంభవమ్ము
కలుగునప్పుడు, భారతా! కల విధాల ॥ 3

ఏసమస్త యోనులయందు నెల్ల మూర్తు
లుద్భవముఁ జెందు ఆ మహద్యోని బ్రహ్మ,
దైహిక విశేషములఁ గూర్చి తనరు ప్రకృతి;
తండ్రినే నేను, బీజప్రదాత నగుట ॥ 4

అమల సత్త్వమ్మను, రజస్సు, తమసనుచును,
మూడుగుణములు ప్రకృతి జమ్ములు తనర్చు ;
దేహమం దవ్యయ మ్మగు దేహి, నందె
యున్నవాని, బంధించుచు, నున్న, వనఘ! 5

అందు సత్త్వమ్ము నిర్మల మౌట చేత
నగుఁ బ్రకాశకము, అనామయమ్ము; ఇద్ది
జ్ఞానసుఖముల యెడఁగల సంగ కార
ణమున భూతాల బంధించు సుమి, కిరీటి! 6

రజసు, రాగాత్మకమ్మది; ప్రభవమందె
తృష్ణనుండి, సంగమునుండి, తెలియు, పార్థ!
కర్మయెడను సంగమ్ముచేఁ గట్టి వేయు
అద్ది దేహిని, మఱువంగవద్దు దీని ॥ 7

కాని, యజ్ఞానమున నుండి కలిగెఁ దమసు;
దేహులను మోహమున ముంచు తెన్ను కలది;
అలప్రమాదమ్ము, జాగు, నిద్ర, లంకతాన
కట్టివైచును, భారతా! పట్టి, దేహి ॥ 8

సుఖము నందు సత్త్వమ్ము కూర్చును, కిరీటి!
రజసు కర్మలయందుఁ గూర్చుఁగను జూచు;
కాని, తమసన్న, జ్ఞానమ్ముఁగప్పివైచు,
తప్పక, ప్రమాదమును గూర్చు ముప్పు కలుగ ॥ 9

రజసును దమస్సు నణచి, భారత! తనంత
సత్త్వ మభివృద్ధి పొందెడుఁ జాలవఱకు;
సత్త్వతమసుల నణచి, రజస్సు పెరుగు;
తమసు పెంపొందు, రజసుసత్త్వాల నణచి ॥ 10

ఎల్ల ద్వారమ్ములందున, ఈ శరీర
మునను జ్ఞానప్రకాశముల్ పుట్టునెపుడు,
అపుడు సత్త్వగుణము నిశ్చయముగ వృద్ధి
నందుచున్నది యని తెలియంగ వలయు ॥ 11

రజసు వృద్ధిని బొంద, నారంభమగును
కర్మలు, ప్రవృత్తి, లోభమ్ము కలుగుట, స్పృహ,
అశమమును, బొడచూపు చిహ్నములు, పార్థ!
మానవ స్వభావము నందు మార్పుచేత ॥ 12

అప్రకాశమ్ము, మోహమ్ము, నల్లుకొనును;
అప్రవృత్తి, ప్రమాదమ్ము, ఆవహిల్లు;
తమసు తా నభివృద్ధిఁ బొందంగ నివ్వి
పుట్టుచుండెడు, నరునిలో, పురుష వృషభ ! 13

సత్త్వము ప్రవృద్ధి చెందెడు సమయమందు
నెపుడు దేహి లయమ్మగు, నపుడు, తత్త్వ
వేత్తలకును బ్రాప్తించెడు విమల లోక,
మతనికిని బొందనయ్యెడు, అనఘ! పార్థ! 14

రజసి పెరుగుచు నుండఁగఁ బ్రళయమైన,
జననమగు నరులను కర్మసంగులందు ;
అట్టులె, తమోగుణమున లయమ్ము కలుగ,
ఉద్భవించును పశ్వాది యోనులందు ॥ 15

సుకృతకర్మమునకుఁ జెప్పుచుండ్రు విదులు
ఫలము సాత్త్వికమౌచు, నిర్మలము నగును ;
గాని, రజసుఫలమ్ము దుఃఖమ్ము కూర్చు ;
తమసునకును అజ్ఞానమ్ము తగు ఫలమ్ము ॥ 16

జ్ఞానగుణ ముద్భవించును సత్త్వమునను;
రజసుగుణమున లోభమ్మె ప్రభవ మొందు;
మోహము, ప్రమాద, మజ్ఞానము ననునవియ
తమసు గుణము వలనను ఉద్భవము చెందు ॥ 17

ఊర్ధ్వమున కేగుదురు సత్త్వమున్న వారు ;
రాజసులు మధ్యనుండ్రు స్థిరమ్ము కాగ;
అధమ గుణవృత్తులం బొల్చు నట్టివారు
తామసులు జారుదురు క్రింది తలములకును ॥ 18

గుణములను మించి ద్రష్ట యింకొండు కర్త
నన్యు నెప్పుడు తాఁ దెలియంగఁ బోడొ,
త్రిగుణముల కంటెఁ బరముని దెలియఁ గలఁడొ,
అప్పుడాతండు నా భావ మమరఁ జెందు ॥ 19

దేహ ముద్భవించుట కగు త్రిగుణములను
వీని దాటిన యాదేహి తాను జన్మ
మృత్యు జరల దుఃఖము నుండి యిల విముక్తి
నంది, పొందెడు నమృతత్వ, మనఘ! పార్థ! 20

అర్జునుఁడుః అనును
ఎట్టి చిహ్నమ్ములను జేసి యీ గుణత్ర
యమ్మును నతిక్రమించెనం చనఁగఁ బోలు;
ఎట్టి యాచారమతనిది? ఎట్టు లీ గు
ణత్రయాతీతుఁ డగును? కృష్ణ, వచింపు ॥ 21

శ్రీ భగవానుఁడుః అనును
ఇటుఁ బ్రకాశమే గాని, ప్రవృత్తి గాని,
మోహమేగాని, పాండవా! పొడమి నపుడు,
ద్వేషమేమాత్రమును లేదు; స్వీకరించు;
లేద, వాని నివృత్తికై లేదు వాంఛ ॥ 22

తనను గా నట్లెవఁడు తటస్థమ్ముఁ జెందు?
ఎవనిని గుణమ్ములెటుఁ జలియింప లేవు?
గుణముల ప్రవర్తన మ్మనుకొనుచు నెవఁడు
నిశ్చలత, చలింపక, తాను నెగడనేర్చు? 23

సమత సుఖదుఃఖముల యందు స్వస్థుఁడగును
సముఁడు లోష్టాశ్మముల యందు, స్వర్ణమందు,
తుల్యుఁడు ప్రియాప్రియముల యందునను నెవఁడు?
తుల్యుఁ డెవఁడు నిందాత్మ సంస్తుతుల యందు? 24

మానమైనను, అవమానమైన నొకటి;
అరియొ, మిత్రుఁడో,యెవ్వారలైన నొకటి;
ఎవ్వఁ డారంభములఁ ద్యజియించు,నతఁడు
గౌనముల కతీతుఁ డనుచుఁ బేర్కొం్రదు, విజయ ! 25

సంతతమ్ము న న్నవ్యభిచార భక్తి
యోగముననను సేవించుచు నుండు నెవ్వఁ,
డతఁడు గుణములకు అతీతుఁడై యెసంగి,
అర్హుఁడయ్యేడు, పార్థ! బ్రహ్మత్వమునకు ॥ 26

అమృతమునకేని, అల యవ్యయమున కేని,
మూలమగు శాశ్వతపు ధర్మమునకు నేని,
ఒక్కటే యొక్క యానంద మొందఁ గలుగ,
బ్రహ్మకేన, యాధారమై పరగుదు గద ॥ 27

ఇటులు
గుణత్రయవిభాగ యోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునైదవ అధ్యాయము

### పురుషోత్తమ యోగము

శ్రీ భగవానుఁడుః అనును
పైకి మూలమ్ము, మఱి, దిగువకును శాఖ,
లవ్యయమ్మైన యశ్వద్ధ మందు రద్ది;
దేని యాకులు వేదాలొ, దానిఁ దెలియు
వేత్తయెవ్వాఁడొ, యాతఁడే వేదవేత్త ‖ 1

పైకి దిగువకా శాఖలు వ్యాప్తి గాంచు ;
గుణములేపెంచు విషయమ్ము లను చివుళ్ళు ;
కర్మ బంధింప మనుజ లోకాన, దిగువ
తీగఁ బ్రవేశించు మూలమ్ము లగణితముగ ‖ 2

దీనియారూపమున్నట్లు కాన మిందు ;
లేదు తుద ; లేదు, మొదలును; లేదు స్థితియు;
వేరు నాటిన యీ రావి వృక్షమును, న
సంగ శస్త్రమ్ముచే, తెగి, చావ, నఱకి ‖ 3

పిదప, దేనిఁ జేరిన, రారొ, వెనుక మఱలి,
దేని తొలి ప్రవృత్తి యొగి వ్యాప్తిఁ గనె, నదియె
వెదుకఁ దగినట్టిది పదమ్ము, వెదకెదనని,
యాశ్రయింపంగ వలయు నయ్యాది పురుషు ‖ 4

మోహమును, మానమును, సంగమును, దొలంగ,
ఆత్మనిష్ఠులై, నిష్కాములై యెసంగి,
దాటి సుఖము దుఃఖమ్మను ద్వంద్వముల, అ
మూఢు లాయవ్యయపదమ్ముఁ బొందనేర్తు ॥ 5

ఎటకుఁ జేర్కొన్నఁ, దిరిగి వచ్చుటయె లేదు ;
పరమ ధామమ్ము నాది యాపరమ పదము;
ఆపదముఁ బ్రకాశింపఁ జేయఁగను నేర
రా శశాంకుండు, సూర్యుండు, నగ్నియేని ॥ 6

జీవలోకమ్మునందలి జీవభూతుఁ
డాసనాతనుఁ డంశమే యగును నాకు;
అద్ది లాగెడుఁ బ్రకృతిస్థమైన యట్టి
యారిఁటి, మనస్సుతో నింద్రియమ్ములైదు ॥ 7

ఎపుడు పొందు ఆ దేహమ్ము నీశ్వరుండు,
విడచి యేగెడు నెపుడొ, యావేళలందు
వీనిని గ్రహించి చక్కగా వెడలు చుండు,
వాసనల స్థానముల నుండి వాయువువలె ॥ 8

చక్షువును, శ్రోత్రమును, మఱి, స్పర్శనమ్ము,
రసనమును, ఘ్రాణము, మనస్సుఁ, బ్రాణి, తనకు
నుండఁగ నివాస భూములై యొప్పుచుండ
విషయముల నన్నిఁటి ననుభవించు చుండు ॥ 9

ఉండినను గాని, వెడలుచు నున్నఁ గాని,
గుణములను గూడి యనుభూతిఁ గొనినఁ గాని,
చూడఁ జాలరు జ్ఞానమ్ము శూన్యమగుడు;
చూడఁగఁ గలారు జ్ఞానచక్షుషులు వాని ॥ 10

స్వస్వరూపమ్మునందె యవస్థిత మని
యోగులు ప్రయత్నమునఁ దెలియుదురు దీని ;
ఐన, అకృతాత్ములైనఁ, బ్రయత్నముండి,
తెలియనేరరు లోపించు తెలివిఁజేసి ॥ 11

ఇనునియందలి యే తేజ, మెల్ల జగము
భాసిలఁగఁజేయు, శశిదేదొ, పావకునిది
యేదొ, యట్టి యా తేజస్సు నాది కాఁగఁ
దెలిసికొను, మయ్య! అది యెట, దేని నున్న ॥ 12

ఓజసుగఁ బ్రవేశమ్ము నే నొంది పుడమి,
భూతముల ధరించుచునుండు పురుషుఁ డేను;
సోముఁడ, రసాత్మకుఁడనయి, భూమి యోష
ధులకుఁ బుష్టి పుష్కలముగఁ గలుగఁజేతు ॥ 13

ప్రాణుల శరీరములను వైశ్వానరుండ
నగుచు నే నాశ్రయమ్మంది, అన్నమద్ది
నాల్గు విధములు నొగిఁ బచనమ్ము చేతుఁ
బ్రాణము, అపానమును, జేరి పాళ్లకొలఁది ॥ 14

సకల హృది సంనివిష్టుండ ; నొకండ, నేను ;
స్మృతియు, జ్ఞాన, మపోహన, మ్మేనొకండ;
వేదములు సమస్తమ్మును, వేద్య, మేన;
వేదముల యంతమే; నేనె, వేద విత్తు ॥ 15

క్షరుఁడు, అక్షరుఁ డనుచు లోకమ్మునందుఁ,
బురుషు లిద్దరు మాత్రమ్మ వరలు చుంద్రు ;
సర్వభూతమ్ములు తలంప క్షరము లగును ;
అక్షరుం డంద్రు కూటస్థు నతని నొకని ॥ 16

అయిన, ఉత్తమపురుషుఁ డొయన్యుఁ డైన
యతఁ డు దాహృతుండగుఁ బరమాత్ముఁ డనుచు,
వ్యాప్తినిం గాంచి లోకత్రయమ్ము నందు
నెవఁడు భరియించు, నవ్యయుం డీశుఁ డతడు ॥ 17

ఏనతీతుండ, క్షరమున కెందుచేత,
అక్షరమ్మున కుత్తముఁ డౌదుఁ గూడ,
అందుచేతనె వేదమ్ములందు, లోక
మందుఁ, బురుషోత్తముండని యనఁ బరగుదు ॥ 18

నన్నునే, పురుషోత్తముం డన్న మతిని
ఎవఁ డసంమూఢుడై యొప్పి యెఱుగ నేర్చు,
అతఁడె సర్వజ్ఞుఁ, డాతండె యన్ని భావ
ములను బూజించు నన్ను నెప్పుడును, పార్థ! 19

ఇటుల, ఈగుహ్యతమశాస్త్ర మిద్ది, అనఘ!
నేను బోధింపఁ గను నయ్యె; దీనిఁ దెలిసి,
బుద్ధిమంతుండుగను నొప్పు పూరుషుండు,
భారతా! కృతకృత్యుఁడై పఱఁగుఁ జుమ్మ ॥ 20

ఇటులు
పురుషోత్తమయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునారవ అధ్యాయము

### దైవాసుర సంపద్విభాగ యోగము

శ్రీ భగవానుఁడు : అనును
దైవగుణము, లభయము, సత్త్వమ్ము, శుద్ధి,
జ్ఞానయోగమ్ము నందలి, సంస్థితియును,
దానమును, యజ్ఞమును, మఱి, దమము కూడ,
తపసు, ఆర్జవము, మఱి, స్వాధ్యాయ మదియు ॥ 1

సత్యము, అహింస, క్రోధవిసర్జనమ్ము,
త్యాగము, అపైశునము, శాంతి, అతులభూత
దయ, అలోలత్వ మదియు, మార్దవము, హ్రీయు,
చపల భావమ్ము లేకుండ సాగుచుంట ॥ 2

తేజ, మద్రోహమును, మఱి, ధృతియు, శౌచ
మును, క్షమయు, నాతిమానితయు, ననఁ బరుగు
నవ్వి, దైవసంపదతోడనైన జన్మ
పొందు వానికి, భారతా! చెందఁ గలుగు ॥ 3

దంభము, అభిమానమ్మును, దర్పమదియు,
క్రోధ, మజ్ఞానము, మఱి, పారుష్యము – ఇవి,
అసుర సంపదతోడనే యైన జన్మ
పొందువానికి, అర్జునా! పొడము చుండు ॥ 4

దైవ సంపద మోక్షమ్ము దారి తీయ,
అసుర సంపద బంధించు నని తలంత్రు ;
దైవ సంపత్తు తోపుట్టి, తనరుదీవు,
దుఃఖపడకుమ, అర్జునా! దుఃఖపడకు ॥ 5

భూతములసృష్టి యీ లోకమునను రెండు
విధములెయగు దైవాసుర భేదములను ;
విపులముగఁ జెప్ప బడె దైవ విధపు సృష్టి,
ఆసుర విధమ్ము నానుండి, అర్జున! విను ॥ 6

అసుర జనము లేదియుఁ దెలియంగఁ బోరు,
ఎది ప్రవృత్తియో, లేక, నివృత్తి యెదియొ;
ఎఱుగ రాచారమును, శౌచమెఱుగఁ బోరు;
సత్యమును నేని యవ్వారు చాల రెఱుఁగ ॥ 7

సత్యమును గాదు; మఱి, ప్రతిష్ఠమ్ము కాదు;
ఈశ్వరము కాదు; కామమ్ము హేతువైన
దిది; పరస్పర సంభూతమేని కాదు ;
అన్య మింకేమి కాఁగల్గు నంద్రు వారు ॥ 8

ఈయభిప్రాయముల నాశ్రయించువార
లల్పబుద్ధులు, నష్టాత్ము లైనవార;
లహితు లుగ్ర కర్ములు జన్మమందుచుంద్రు
లోకము నశించు కొఱకునై, ఓ కిరీటి ! 9

ఆశ్రయించి దుష్పూర మౌనట్టి యాశ,
దంభమానమదమ్ముల దరికిఁ జేర్చి,
మోహమునను అసద్గ్రాహముల గ్రహించి,
అశుచివ్రతులై ప్రవర్తింతు రన్ని గతుల ॥ 10

అపరిమేయమ్ము ప్రలయాంతమైన చింత
నాశ్రయించిన వారయి, యీ శరీర
భోగపరులయి, యావత్తు, భోగమునకు
మాత్రమే యని, నిశ్చిత మానసు లయి ॥ 11

బద్ధు లయి యాశలను పెను పాశములను,
కామమును, క్రోధముఁ దమ దగ్గఱకుఁ జేర్చి,
కామ భోగార్థ మన్యాయ కారణముల
అర్థ సంచయ మొనరించు నాశ నుంద్రు ॥ 12

ఇద్ది లబ్ధమ్ము కాగల్గె నిపుడు నాకు ;
తీరఁ గలుగు ఈనాదు మనోరథమ్ము ;
ఇద్ది కలదు; కల్గెడు నాకు నిదియుఁ గూడ;
తిరిగి, తిరిగి, ధనమ్ము నా పరమె యగును ॥ 13

ఈరిపుఁ డిదె నాచే హతమారినాఁడు;
హతము చేయంగఁ గలను నే నితర రిపుల
ఈశ్వరుఁడ నేను; భోగిని నేను సతము;
ఏను సిద్ధుండ; బలమున్న; దేను సుఖిని ॥ 14

ఆఢ్యుఁడను నేను; అభిజన్ముఁ డగుదు నేను;
అన్యుఁ డొక్కఁ డెవ్వండు నా కగును జోడు?
యజ్ఞము లొనర్తు; ఇచ్చెద; అందు కొందు
ముదమనుచు నాతఁ డజ్ఞాన మోహితుఁ డయి ॥ 15

బహుళ చిత్త విభ్రాంతుల పాలగుచును,
మోహజాల సమావృత భూతుఁ డగుచు,
కామ భోగప్రసక్తుఁ డై క్రాలు చుండి,
అశుచనరకమ్మునను బడి, యార్తి మగ్గు ॥ 16

ఆత్మసంభావితులు, స్తబ్ధులైనవారు,
ధనమదము, మానమదమును దలకు నెక్కఁ,
అవిధి పూర్వకముగ నామ యజ్ఞములను
దంభముగఁ జేయు చుంద్రుగదా, కిరీటి ॥ 17

కామమును, క్రోధమును, అహంకారము, మఱి,
బలము, దర్పమ్ము, నాశ్రయింపను గడంగి,
తమదు పరుల దేహములందుఁ దనరు నన్ను
ద్వేషమునఁ జూచెద రసూయ పెనగొనంగ ॥ 18

ద్వేషమున, అశుభముల సల్పెడు నరాధ
ములను, తత్క్రూరులను సతముఁ బడఁ ద్రోయు
చుందు ఆసుర సంసారయోనులందు
మాత్రమే నేను, కౌన్తేయ! మరల, మరల ॥ 19

మూఢు లాసురయోనిని బొందుచుండి,
జన్మ జన్మకు, అందుచే, సవ్యసాచి!
పొందకయె నన్ను, అధమాధములుగ నిలను
బ్రదుకుచున్నారు, కాలమ్ము పరిమితి యెది ॥ 20

నరకమునకు ద్వారము మూడు తెలుఁగు లగును;
ఆత్మను నశింపఁ జేయంగ నైన దద్ది ;
అల్ల కామమ్ము, క్రోధమ్ము; అటులె, లోభ;
మగుట విడువంగ వలయు, ఈ త్రిగుణములను ॥ 21

పురుషుఁ డీతమో ద్వారముల్ మూటినుండి
యును విముక్తుఁడై తనయాత్మ కొగిని శ్రేయ
మునె యొనర్చుకొనును దాను, పురుషవృషభ !
పరమగతిఁ బొందు దానఁ దప్పకయె యతఁడు ॥ 22

ఎవఁడు శాస్త్ర విధి విడచి, యిచ్ఛవచ్చి
నటులు కామప్రయుక్తుఁడై యవని మెలఁగు,
అతఁడు నేరండు సంసిద్ధి నందు కొనఁగ;
లేదు సుఖము; పరమగతి లేదు, లేదు ॥ 23

అందుచే, నీకును బ్రమాణమగును శాస్త్ర
విధియ సుమ్ము కార్యాకార్య విషయ నిర్ణ
యమ్మునందు శాస్త్రోక్తమ్ము ననుసరించి,
యర్హుఁ డవు కర్మ నిపుడు చేయంగనీవు ॥ 24

ఇటులు

దైవాసుర సంపద్విభాగ యోగము పూర్తి.

# శ్రీ మద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునేడవ అధ్యాయము

### శ్రద్ధాత్రయ విభాగ యోగము

అర్జునుఁడు : అనును
ఎవరు శాస్త్ర విధిని విసర్జించి, శ్రద్ధ
తోడఁ గూడు కొనుచు యజింతురో, మహాత్మ!
వారి నిష్ఠ యెట్టిదియొ? సత్త్వమ్మొ? లేక,
రజ సగునొ? తమ స్సగునొ? నిర్ణయ మొనర్చు ॥ 1

శ్రీ భగవానుఁడు : అనును
దేహధారుల కీశ్రద్ధ త్రివిధ మగును
వారల స్వభావమును బట్టి ప్రభవమగుచు,
సాత్త్వికమ్మను, మఱి, రాజసమ్మ, తామ
స మ్మనుచు; వినిచెద, ధనంజయ! విను, మిదె ॥ 2

శ్రద్ధ, సత్త్వాను రూపమై సర్వమునకుఁ
గలుగుచున్నది, భారతా! తలఁచి చూడ;
పురుషుఁ డితడు శ్రద్ధామయుం డరయు కొలఁది;
ఎట్టి శ్రద్ధ యెవ్వని, దతఁ డట్టి వాఁడు ॥ 3

సురలఁ బూజింత్రు సాత్త్విక శుద్ధ గుణులు ;
రాజసగుణులు, యక్షుల, రాక్షసులను;
ప్రేతములను బూజింతురు, భూతములను
అన్యులు తమోగుణాధికులైన జనులు ॥ 4

ఏ జనులు దంభము, అహ, మ్మహీనమగుచు,
కామ రాగమ్ముల బలమ్ము కలిగియుండి,
ఘోర తప మాచరింతురో దూరు లౌచు
శాస్త్రమునకు, కౌన్తేయ! లక్ష్యమ్ము లేక ॥ 5

బుద్ధిమాలి, శరీరస్థ భూతములఁ గృ
శింపఁ జేయంగఁ జూతురో, యీ శరీర
మునను లోనున్న ననుగూడఁ గొనక లెక్క,
వార లాసురనిశ్చయుల్, పార్థ! తెలియు ॥ 6

ఇఁకను, సకలమ్మునకుఁ బ్రియమ్మిడెడు నోగి
రమ్ము కూడ నయ్యెడు త్రివిధమ్ము సుమ్ము;
తపసు, యజ్ఞమ్ము, నట్టులే, దాన మదియు;
వీనిలో ఈ విభేదమ్ముల్, వినుము, తెలియు ॥ 7

రసము, హృద్యత, స్నిగ్ధ స్థిరత్వములను,
ఆయువు, బలమ్ము, సత్త్వ, మనామ యమ్ము,
ప్రీతియు, సుఖమ్ము, వీనిని బెంపు చేయు
సాత్త్వికుల ప్రియాహారముల్, సవ్యసాచి! 8

ఆమ్ల, లవణ, కట్వ్యత్యుష్ణ మైనవియును,
రూక్షతీక్ష్ణ విదాహక పక్షములును,
రాజసుల కిష్టమగు నోగిరమ్ము లగును,
దుఃఖ శోకామ యాదిప్రదుల్, కిరీటి! 9

తామసుల ప్రియ భోజనమేమి యనఁగ;
యాతయామమ్మై, గతరసమ్మైన దియును,
పాసిపోయిన యట్టిది, పర్యుషితము,
మిగిలినది యొరుల్ తినఁగ, నమేధ్య మదియు ॥ 10

ఫలము కాంక్షింపకయె, శాస్త్ర పద్ధతిగనె,
ఇద్ది యష్టవ్య మనుచునే యెంచి, మనసు
నిశ్చయ పఱచి, యిందు దేనిని నొనర్తు
రట్టి యజ్ఞమ్ము సాత్త్వికమ్మనఁగఁ జెల్లు ॥ 11

కాని, యజ్ఞఫలమ్ముపై కాంక్షచేత,
లేద, దంభార్థమే కాని, యేది చేయఁ
బడునో యట్టి యజ్ఞమ్మును, భరతముఖ్య !
ప్రకటముగ, నెఱుంగుము నీవు రాజసమని ॥ 12

విధివిహీనమ్ము, అన్నమ్ముపేరు లేదు;
మంత్రహీనమ్ము, దక్షిణ మాట, సున్న;
మఱియు, శ్రద్ధా విరహితమ్ము, మాట లేల,
తామస మ్మని దానిఁ బెద్దలు వచింత్రు ॥ 13

దేవతలను బ్రాజ్ఞుల, గురు ద్విజ జనాళిఁ
బూజచేయుట, ఆర్జవమ్మును, శుచియును,
బ్రహ్మచర్య, మహింసయు, పాండవేయ!
దేహ సంబంధ తపమంచుఁ దెలిసి కొమ్ము ॥ 14

ప్రియహితమును, సత్యము, అనుద్వేగకరము,
నైనవాక్యమ్ము, స్వాధ్యాయమైన దాని
యభ్యసనమును సహిత, మోయర్జునా! వ
చింపఁ బడెడును, తెలియు, వాచిక తపస్సు ॥ 15

స్వాంతమందుఁ బ్రసాదమ్ము, సౌమ్యతయును,
ఆత్మనిగ్రహమును, మౌన, మవియుఁ, బైగ,
భావసంశుద్ధి, మొదలగు వాని, మాన
సికతపస్సని, అర్జునా! చెప్పుచుంద్రు ॥ 16

పరమ మగు శ్రద్ధఁ జేయంగఁ బడు తపస్సు,
కూడ మూడు విధమ్ములగును దలంపః
ఫలముపైఁ గాంక్షలేక, యుక్తులు పొనర్చు
తపసు, సాత్త్విక మని పండితాళి పలుకు ॥ 17

అల్లసత్కారమానపూజార్థమైన
తపసు,దంభమ్ము గూర్చి మాత్రమ్మెయేది
చేయఁబడు,నద్ది యిప్పట్ల చెప్పఁ బడును
రాజసమని,అధ్రువము, చలమ్ము సుమ్ము ॥ 18

తెలివి తక్కువచేఁ బీడఁ దెచ్చి పెట్టు
కొనుటకైన తపసు గాని, కుటిల వృత్తి
పరుల చెఱుపునకైన తపస్సు గాని,
తామస తపస్సన కగు, నుదాహృతమ్ము ॥ 19

ఏది దాతవ్యమనుచును, ఇచ్ఛలేక
ప్రత్యుపకృతి యెడను, దేశ పాత్ర కాల
ములకు నను గుణ్యముగ నీయఁ గలుగు దాన
మద్ది సాత్త్విక మగు దాన మని స్మృతమ్ము॥ 20

దానమెది పరిక్లిష్ట సందర్భమందుఁ
బ్రత్యుపకృతికిఁగాని, తత్ఫలము తిరిగి
పొందునుద్దేశ్యమునగాని, పుట్టుకఁ గను,
అద్ది రాజసమగు దానమని స్మృతమ్ము ॥ 21

దేశకాలమ్ము లీరెంటి తెలివి తోప
కయె, అపాత్రులకును జేయఁ గనెద రెద్ది
సత్కృతము గాకయు, అవజ్ఞాత మగుచు,
దాన మది తామసమున, కుదాహృతమ్ము ॥ 22

బ్రహ్మమునకు "ఓమ్, తత్, సత్"లు పరగుచుండుఁ
ద్రివిధములుగ నిర్దేశమ్ము, తెలిసి కొనుము ;
వీనిచే, బ్రాహ్మణులు, మూడు వేదములును,
యజ్ఞములును విహితములై యలరె తొలిని ॥ 23

అందుచే, ఉచ్చరించి, "ఓమ్" అనుచుఁ దొలుత,
యజ్ఞ దాన తపః క్రియలందు, శాస్త్ర
మనుసరించి, చేసెడు కర్మలందు, బ్రహ్మ
వాదులు సతమ్ము, తప్పక, వ్యవహరింత్రు ॥ 24

మోక్షకాంక్షులచే, ఫలమ్మొకింత
యడుగఁబడక, తపస్సును, యజ్ఞము, మఱి,
దానము, వివిధమగుక్రియల్, "తదితి" యనుచుఁ
జేయఁ బడుచుండు, సవ్యసాచీ! ఇహాన ॥ 25

"సత్" అనుచు సత్తునకె కాక, సాధు భావ
మునకు నుపయోగపడు; అట్లె, ముఖ్యమౌప్ర
శస్త కర్మకు, అర్జునా! " సత్ " పదమ్ము
వాడుచుందురు; నిలుపు సత్పదము మదిని ॥ 26

యజ్ఞమందు, తపస్సందు, అల్ల దాన
మందు నగుస్థితి " సత్ " అని యనఁగఁ బడును;
అందు కొఱకగు ఆ కర్మ యదియుఁ గూడ,
" సత్ " అనియె పల్కఁబడుఁ బ్రపంచమ్ము నందు ॥ 27

ఎద్ది అశ్రద్ధతోఁ జేతు రద్ది హుతమొ,
దత్తమో, తప్త తపమొ,యేదైనఁ గాని,
పార్థ! అది అసత్తని చెప్పఁబడుచు నుండు;
లే దిచట నేని;అట నేని, లేని దద్ది ॥ 28

ఇటులు
శ్రద్ధాత్రయ విభాగయోగము పూర్తి.

# శ్రీమద్భగవద్గీత

## తెనుగు గీతములు

### పదునెనిమిదవ అధ్యాయము

### మోక్ష సంన్యాసయోగము

అర్జునుఁడుః అనును
ఏది సంన్యాస తత్త్వమో యెఱుఁగు వాంఛ
కలదు నాకు, మహాబాహు! తెలియఁ జెపుమ;
త్యాగ తత్త్వమ్ము గూర్చి సైతమ్ము, కృష్ణ !
విడివిడిగను, హృషీకేశ! విపులముగను ‖ 1

శ్రీ భగవానుఁడు : అనును
కామ్య కర్మల న్యాసమ్మె కవులు తెలియు
ఫణితి సంన్యాసమనగ, ఓపార్థ! అనఘ!
పుడమి కర్మఫల త్యాగమును విచక్ష
ణులు పలుకుదురు త్యాగమనుచు, కిరీటి! 2

"కర్మ, త్యాజ్యమ్ము, దోషయుక్తమ్ము కాన",
అని మనీషిణు లొకకొంద ఱనుచు నుంద్రు;
యజ్ఞ దాన తపః కర్మ లవ్వి మాత్ర
మెన్నఁడు దృజింపరాదందు రెన్న నొరులు ‖ 3

వానిలోఁ ద్యాగమును గూర్చి, భరత వృషభ !
వినుమ, నాదైన నిశ్చయమును వచింతు;
త్యాగమును గూడ త్రివిధమే యనుచు సంప్ర
కీర్తితమ్ము, ధనంజయ! క్షితి తలాన ‖ 4

యజ్ఞ దాన తపః కర్మ లవ్వి కార్య
ములె, త్యజింపఁగ రానివి, తలఁప, పార్థ!
యజ్ఞము, తపస్సు, దానమ్ము, ననెడు నవెమ
నీషిణులఁ బావనము చేయు నిశ్చయముగ ॥ 5

కనుక, యీ పనుల్ కూడ సంగమ్ము విడచి,
ఫలముపై చూపులేక యేవంతయేని,
చేయఁదగినవి యనుచు నిశ్చితము నాదు
మతము, మతముల నుత్తమ మ్మగును, పార్థ! 6

ఐన, నియతకర్మముల త్యాజ్యమ్ము చేయఁ
గను నొకింత మాత్రమును యుక్తమ్ము కాదు;
మోహమున ఆపరిత్యాగము నొనరుచుట
తామసంబని పరికీర్తితమ్ము, పార్థ! 7

కాయపుంగ్లేశ భయముచేఁ గర్మమెపుడు
దుఃఖమేనని యెవ్వండు తొలఁగు, నతఁడు
రాజస త్యాగమును జేసి, ప్రతిఫలముగ
త్యాగఫలమును నెంత మాత్రమ్ముఁ గనఁడు ॥ 8

సంగమును, ఫలమ్మును, సమస్తమ్ము విడచి,
నియత కర్మను కార్య మనియె యొనర్చు
నెవ్వఁడు తనశక్తి కొలంది యిందు, పార్థ!
అతని త్యాగమ్ము సాత్త్విక మని తలంతు ॥ 9

అకుశలమ్మంచు కర్మ ద్వేష్యమ్ము కాదు ;
కర్మకుశలమ్మటంచు సంగమ్ము లేదు ;
అతఁడు సత్త్వసమావిష్టుఁ ,డతఁడు త్యాగి,
లేవు సంశయమ్ములిఁక;మేధావి యతఁడె ॥ 10

కర్మల నశేషముగ విడంగను నశక్య
మగునుగా దేహధారుల; కందుచేత,
ఎతఁడు కర్మఫల త్యాగి, అతఁడె యగును
త్యాగి యని చెప్పఁ బడుటకుఁ దగినవాఁడు ॥ 11

ఇష్టము, అనిష్టమును, మిశ్ర, మిట్లు త్రివిధ
మగును కర్మఫలము మృతి యైన పిదప,
ఫలమును ద్యజింపకున్నట్టి వారికిందుఁ ;
గాని, సంన్యాసులకొ?సుంతయేని లేదు ॥ 12

కర్మలెల్లను సిద్ధింపఁ గలుగుటకును
జెప్పఁ బడె సాంఖ్యమందు నిశ్చితము కాఁగ
ఈయయిదు కారణాల్, గుడాకేశ! ఇందు;
తెలిసికొనఁ గదె వాని నా వలన నీవు ॥ 13

ఆదియగు నధిష్ఠాన, మాయటులె కర్త,
కరణములు, పలువిధములఁ బరఁగు చేష్ట,
లవ్వి వేర్వేరు, వివిధమ్ములై యెసంగు;
దైవమే వానియందు నైదవది యగును ॥ 14

న్యాయమైనను, విపరీతమైన నేని,
ఇల,నరుఁడు మనోవాక్కాయములను దేని
చేతనైనఁ గర్మ మొదలు చేసె నేని,
దానికీ యైదు హేతువు లౌను సుమ్ము ॥ 15

ప్రకృతమున నట్లు తెలియంగఁ బడుచునున్న
అకృతబుద్ధిచే, కేవల మాత్మనెవఁడు
కర్తగఁ దలంచు చుండు నిష్కారణముగ,
అట్టి దుర్మతి తాఁ దెలియంగ లేఁడు ॥ 16

ఎవని భావ మహము నశియించిన దగు,
ఎవని బుద్ధియు సక్త మింతేని కాదు,
జనుల వీరిని దాను జంపినను గూడ,
హంతయును గాడు, తాన్ బద్ధుఁడైనఁ గాడు ॥ 17

జ్ఞానమును జ్ఞేయమును పరిజ్ఞాత యనఁగ,
కర్మ చోదనమది తరగతులు మూడు;
కరణమును, కర్త, కర్మ, నాఁ బరఁగు చుండు
కర్మ సంగ్రహమును తరగతులు మూడు ॥ 18

జ్ఞానమును, కర్మయును, మఱి, కర్త యనఁగ,
మూడుగ గుణాల భేదమ్ముకూడి చెప్పఁ
-బడియెను గుణ సంఖ్యానమ్ము పద్ధతి నొగి;
వానిఁ గూడను విను, చెప్పఁ బడిన యటులు ॥ 19

వివిధముగ విభక్తమ్మైన వివిధ భూత
ములను, అవిభక్త, మవ్యయమ్మను నొకండె
భావముగఁ జూచు దేనిచే స్వాంతమునను
అట్టి జ్ఞానమ్మ సాత్త్వికమనుచుఁ దెలియు ॥ 20

ఐన, సర్వ భూతమ్ముల ఆత్మయందు
వివిధవిధముల నొప్పెడు భిన్నభావ
ములను భేదమ్మ తోడనే తెలియుజ్ఞాన
మెదియొ అది రాజసమ్మని మదినెఱుంగు ॥ 21

ఏక కార్యమ్మ నందు, అదే సమస్త
మువలె, సక్త మహేతు కమ్మగను, స్వల్ప
మగుచుఁ,దత్త్వేతరార్థమౌనట్టి జ్ఞాన
మదియెది,యుదాహృతమ్మ తామసమునకును ॥ 22

నియతమ్మై, సంగరహితమ్మునయి, ఫలమ్మ
నందుఁ దృష్ణలేకయు, రాగమైన, ద్వేష
మైన లేక, చేయఁగఁ బడు నట్టి కర్మ
యేదొ, యది సాత్త్వి కమ్మని యెన్నఁబడును ॥ 23

కాని,ఫలవాంఛతో, అహంకారభావ
మొప్పఁగను, బహుళాయాసమునను, దిరిగి
చేయఁ బడెడు నే కర్మ విశేషముగను,
అద్ది రాజసకర్మయం చనఁగఁ జెల్లు ॥ 24

ఏది, యనుబంధము, క్షయమ్ము, హింస, పౌరు
షమును, యోజింపఁ బడఁక, యజ్ఞానమునను
మొదలు పెట్టంగఁ బడెడునొ పుడమి కర్మ,
యద్ది తామసకర్మయం చనఁగ నొప్పు ॥ 25

ముక్తసంగుఁ, డహంవాది మొదలె కాఁడు,
ధృతియు నుత్సాహమును గూడి యెసఁగువాఁడు,
సిద్ధ్య సిద్ధులచే మార్పుఁ జెందఁ బోడు,
అట్టి కర్తను సాత్త్వికుఁ డనెద రెందు ॥ 26

రాగి, కర్మఫలాపేక్ష ప్రబలువాఁడు,
లుబ్ధుఁ, డశుచి, హింసాత్మకుండును దలంప,
హర్ష శోకాన్వితుండును నైనవాఁడు,
కర్త, రాజసుండని పరికీర్తితుండు ॥ 27

స్తబ్ధుఁడు, అయుక్తుఁ, డలసుండు, శఠుఁడు, నైష్కృ
తికుఁడు, ప్రాకృతుండును, విషాది, పయిపెచ్చు,
దీర్ఘ సూత్రియు నగుచు ధాత్రిని వసించు
కర్త, తామసుండని చెప్పఁగను దనర్చు ॥ 28

బుద్ధియును, ధృతియును గూడ, మూడు మూడు
గుణములను బట్టి భేదముల్; వినుము, చెప్పఁ
బడెడు, వివిధమ్ము, లేయొండు విడువకుండఁ
బుష్కలముగ, ధనంజయా! పుణ్యపురుష ! 29

ఏది బుద్ధి ప్రవృత్తి నివృత్తిఁ దెలియు,
బుద్ధి యేది కార్యాకార్యములను దెలియు,
బుద్ధి యేది బంధము, మోక్షమును నెఱుంగు,
అట్టి బుద్ధియె సాత్త్వికి యండ్రు, పార్థ ! 30

బుద్ధి యెద్దైనచో ధర్మమును అధర్మ
ముగను, గార్యమ్మను అకార్యముగను, ఉన్న
దానికి విపరీతముగ నర్థమ్ము చేయు
అట్టి బుద్ధియ, రాజసి యనఁగ, పార్థ ! 31

బుద్ధియెయ్యది తమసున మున్గియుండి,
ధర్మముగ అధర్మమ్మను దలఁచుచుండు
అర్థముల నన్ని విపరీతమగు విధాన,
అట్టి బుద్ధియ, తామసి యనఁగ, పార్థ! 32

వ్యభిచరింపని యే ధృతి పట్టుచేత
ధ్యానమున మనః ప్రాణేంద్రియముల క్రియలు
జరుపఁ బడుచును సాగునొ సరళగతిని,
అట్టి ధృతి, పార్థ! సాత్త్వికి యనఁగఁ బడును‖ 33

ఎట్టి ధృతి చేత, అర్జునా! ఎక్కువగను
ధర్మకామార్థములను సక్తత వహించి,
ఫల మభిలషించి, సాగింప వలను కలుగు,
నట్టి ధృతి, పార్థ! రాజసి యనఁగ నొప్పు ‖ 34

ధృతియదేదొ, విడువఁడు దుర్మతి భయమ్ము,
స్వప్నమును, శోకము, అలవిషాద మేని,
మదము గూడను, ఒక్కింత మాత్రమైన,
అట్టి ధృతి, పార్థ! తామసి యనఁగఁ జెల్లు ॥ 35

దేని యభ్యాసమునను పొందెడిని బ్రీతి,
మఱియు, దుఃఖాన్తమును బొందు నరుఁడు, పార్థ!
త్రివిధముల నొప్పు సుఖమద్ది, తెలియఁ జెపుదు
ఇపుడు వినుము నావలనను విపులముగను ॥ 36

ఏది తొలుదొల్త విషమటుల్ హృదిని దోచి,
అమృతమును బోలె, పరిణామమందు నగును;
ఆత్మబుద్ధి ప్రసాద జ మ్మద్ది సుమ్ము,
తత్సుఖమె సాత్త్విక మని ప్రోక్తమ్ము, పార్థ! 37

ఇంద్రియములు విషయముల నెలమిఁ జేర,
అగ్రమునయందు నమృతోప మగుచుఁ దోచి,
వెలయు పరిణామమున నెద్ది విషము వోలె,
తత్సుఖము రాజసముగ స్మృతమ్ము, పార్థ! 38

అగ్రమున, అనుబంధమ్మునందుఁ గూడ,
ఆత్మనే సుఖ, మజ్ఞానమందు ముంచు
మైమఱపు, నిద్ర, యాలస్య, మవ్వియుబుక,
తత్సుఖ ముదాహృతమ్మగు, తామసముగ ॥ 39

ఈ ప్రకృతిజ గుణము లీమూడు విడచిన
దేదొ సత్త్వ మద్ది లేదు సృష్టి;
నేల నైనఁ గాని, నింగినైనను గాని,
స్వర్గమందుఁగాని, పలుకు లేల? 40

బ్రాహ్మణ క్షత్రియులకును, వైశ్య శూద్రు
లకును, బ్రకృతి జన్యగుణమ్ము లనుసరించి,
ధర్మములవి, పరంతపా! తఱవఁబడియె
విభజన మొనర్పఁ బడినవి వివరముగను ॥ 41

శమము, దమమును, తపము, శౌచమ్ము, మఱియు,
క్షాంతి, ఆస్తిక్య, మల్ల యార్జవము కూడ,
జ్ఞాన మదియును, మఱియు, విజ్ఞాన మనఁగ,
బ్రహ్మకర్మలై పరగు స్వభావజములె ॥ 42

క్షత్రియులకు సహజ కర్మ; శౌర్యము, ధృతి,
యుద్ధమందు వెన్ను నొగ్గకుంట,
దాక్ష్య తేజములును, దాన, మీశ్వర భావ
మనఁగ లోకసంగ్రహార్ధ మగుచు ॥ 43

కృషియు, గోవురక్ష, యెల్ల వాణిజ్యమ్ము,
వైశ్యకర్మకివి స్వభావజములు;
పై కులాలకైన పరిచర్యయను కర్మ
పరగ శూద్రులకు స్వభావజమ్ము ॥ 44

తనదు తనదు కర్మమున నభిరతుఁడైన
నరుఁడు సిద్ధి నంద నగును లెస్స;
తనదు కర్మ నిరతి జనుఁ డెట్టు లందునో
సిద్ధి, దాని వినుము, చెప్పుచుంటి ॥ 45

భూతముల ప్రవృత్తియె దేని చేత నగునొ?
దేనిచే వ్యాప్తి గన్నదిదెల్ల జగము?
దానిని స్వకర్మ నర్చించి, మానవుండు,
శ్వేతవాహన! పొందెడు సిద్ధి నిందు ॥ 46

ఇమ్ముగ నొనర్చు పరుల ధర్మమ్ము కంటె,
విగుణమేని, స్వధర్మమ్ము ప్రియమొనర్చు;
కర్మము స్వభావనియతమై క్రాలు నెడల,
చేసినను గిల్బిష,మ్మేది చేరరాదు ॥ 47

సహజకర్మ, కౌన్తేయ! దోషాన్వితమ్మె
యగునుగాక, త్యజింపంగఁ దగదు సుమ్ము;
ధూమముననగ్ని పోలిక, దోషమునను
ఎల్లయారంభములును ఆవృతములుగద॥ 48

జితమనస్కుండు, విగత మౌ స్పృహ కలాఁడు,
బుద్ధి సర్వత్రను అసక్త బుద్ధి కాఁగఁ,
పరమ నైష్కర్మ్య సిద్ధిని బడయఁ జాలు,
భారత! అల సంన్యాసమ్ము కారణమున ॥ 49

సిద్ధి పొందినాతఁడు బ్రహ్మఁ జేరుకొనఁగ
నెట్టులో, దాని నా నుండి యెఱుకగనుము
జ్ఞాననిష్ఠకు నటు పరమైన దాని
సంగ్రహముగనె అగుగాక చాలినంత ॥ 50

పరమ శుద్ధమౌ బుద్ధితోఁ బరగుచుండి,
ధృతి కలిగి, యాత్మఁ దనకు స్వాధీన పఱచి,
విడచి శబ్దాదుల వివిధ విషయములను,
త్రోసి రాగమ్ము, ద్వేషమ్ము, దూరముగను॥ 51

లఘు వగుచు నోగిరమ్ము, నిర్జన తలమ్ము
నాశ్రయించి, యల త్రికరణములను నియ
మించి, ధ్యానయోగ పరత, మేటిదగు వి
రాగమును నిత్యముఁ దన కాశ్రయము చేసి ॥ 52

బలము, అహమును, మఱియు, దర్పమ్ము విడచి,
కామమును, క్రోధమును, పరిగ్రహము, విడచి,
నిర్మమత్వమ్ము తోడ, శాంతిని బెనంగి,
బ్రహ్మ భావ పదమున కర్హతను గాంచు ॥ 53

బ్రహ్మ భూతుండు తాను; నిర్మల మనస్సు,
దేనిఁ గూర్చి చింతింపఁ, డెద్దేనిఁ గోరఁ
డఖిల భూతమ్ము లెడ నొక్కయటుల సముఁడు,
పడయు నాయెడ నత్యంత పరమ భక్తి ॥ 54

ఎంతవాఁడనొ? ఎవఁడనో? ఎద్ది తత్త్వ
మో? తెలిసికొను నామీది పూర్ణ భక్తి;
దానిచే, నన్ను, నాదు తత్త్వమును, దెలిసి,
పిదప, నాలోఁ బ్రవేశించు, విజయ! వినుము ‖ 55

ఆశ్రయము నేనుగా సదా అఖిలకర్మ
ములను జేయుచుండియుఁగూడ, పొందఁ గలుగు
నా యనుగ్రహ;మది కారణమ్ము కాఁగ,
అవ్యయమ్మైన, శాశ్వతమ్మైన పదము ‖ 56

మనసునందునె వివిధ కర్మముల నెల్ల
నా కయి త్యజించి, మత్పరుండ వయి, పార్థ !
అల్ల బుద్ధి యోగమ్ము ఉపాశ్రయించి,
అనిశము మనస్సు నాయందె ఆపియుంచు ‖ 57

నన్ను జిత్తమందునను నిల్పి, దుర్గముల్
నాయనుగ్రహమ్ము నను దరింతు ;
పటులు గాక, నీ వహమ్ముచే నొకవేళ
చెవిని బెట్టవో, నశింతు వీవు ‖ 58

ఏలా అహమాశ్రయించుట, "నేను పోర"
ననుచుఁ దలఁచితివో నీవు, వ్యర్థ మిట్టి
నీదివ్య వసాయ మియ్యది? నిన్ను ప్రకృతి
తానె నియమింపఁ గలుగు యుద్ధమ్ము చేయ ‖ 59

నీ దగు స్వభావమున నైన నీదు కర్మ
ముల నిబద్ధుండ వగు నీవు మొదట, పార్థ!
మోహమున నేది చేయంగ బుద్ధి లేదొ,
అదియె చేసెద వవశుఁడ వగుచు నైన ॥ 60

ఈశ్వరుఁడు సర్వభూతాల హృదయ దేశ
ములను నున్నాఁడు మాయచే భూతములను
ఎల్లను జలింపఁజేయుచు నెల్ల యెడల,
అర్జునా! యంత్రముల ఉన్న యటులె చేసి ॥ 61

అతని నొకనినే శరణమ్ము నందఁ గదవె
సర్వభావమ్ములను జేసి, సవ్యసాచి !
ఆతని యనుగ్రహమ్ముచే అందఁగలవు
పరమ శాంతిని, మఱియు, శాశ్వత పదమ్ము ॥ 62

ఇదియ నీకయి నేను విన్పించి యున్న
జ్ఞానము; రహస్యముల రహస్యమ్ము మిగుల;
చేసి దీని విమర్శ అశేషముగను,
ఎటుల ఇచ్ఛించెదవొ తుది, అటులె చేయు ॥ 63

అన్నిఁటను గుహ్యతమమైన యదియ ఇద్ది;
విను, మఱల, నాదు పరమ వాక్కును వచింతు;
ఎక్కుడిష్టుఁడ వగుచుంటి విందు నాకు;
కావునను, నీదు హితము పల్కంగ నుంటి ॥ 64

నన్ను మది నిల్పు ; భక్తితో నన్ను కొలువు;
నన్ననె యజింపు; మిడు వందనమ్ము నాకు;
నీవు నాయందె కలిసి పోనేర్తు; నిజము;
నాకు ప్రియుఁడవు; ప్రతినను నీ కొనర్తు ॥ 65

సర్వధర్మాలు నాకు త్యాజ్యమ్ము చేసి,
శరణు పొందుము నన్ను నొక్కరుని నొకని;
ముక్తుని నొనర్తు కలపాపములను నుండి
నిన్ను, ఈనేన; నీవు చింతింపవలదు ॥ 66

దీని నీ వెన్నఁడు నింతయు తెలుపఁదగదు
సుమి తపోహీనులకును, శుశ్రూష లేని
వారికి, అభక్తులకును, నా పయి అసూయ
గొనెడు నెవ్వండా వానికి, గోప్య మగుట ॥ 67

ఏయతఁడు నాదు భక్తుల ఈ రహస్య
మును బ్రవర్తింపఁ జేయునెప్పుడు, నతండు
పరమ భక్తిని నన్ను గొల్చి, పరము నన్నె
చేరఁగలడు, సంశయము కించిత్తు వలదు ॥ 68

అతని మించి మనుష్యుల యందు మిగుల
ప్రియకరుండైనయతఁ డొండు లేడు నాకు;
ప్రియ తరుఁ డొరుఁ డుండఁగఁ బోడు పృథివినాకు
తలఁప ఆయతనిని మించి, తథ్య మిద్ది ॥ 69

మనల యీ ధర్మ సంవాదమును నెవండు
పఠన చేయంగఁ గలుగు, అవ్వాని జ్ఞాన
యజ్ఞమున పూజనందు కొన్నట్టివాఁడ
అగుదు ననియె, గుడాకేశ! నామతమ్ము ॥ 70

శ్రద్ధతో, అనసూయతో, శ్రవణములను
ఏనరుం డేని వినినను, ఇతఁడుఁ గూడ,
ముక్తుఁ డయి, శుభలోకముల్ పొందఁగలఁడు,
పుణ్యకర్మమ్ములను జేయు పురుషులవలె ॥ 71

దీని నేకాగ్ర చిత్తమ్ముతోన, పార్థ!
విని, గ్రహించితో పూర్తిగ? వినెద, చెపుము;
తావకాజ్ఞాన మోహమ్ము తా నశించె
నా, ధనంజయా! పూర్తిగ? నాకు వినుచు ॥ 72

అర్జునుఁడు : అనును
మోహము, నశించె; స్మృతి, నేను పొందినాఁడ;
అచ్యుతా! నీదగు ననుగ్రహమ్ము చేసి;
సంశయము వాసి, ఒదవితి స్థైర్యమిపుడు;
చేయుదును నీవు నన్ను శాసించి నట్లు ॥ 73

సంజయుఁడు : అనును
కృష్ణపార్థుల సంవాద రీతి గంటి;
అద్భుతము, రోమ హర్షణమ్మైన దిద్ది;
వాసుదేవునకు, మహానుఁ భావుఁడైన
పార్థునకును సంవాదమ్ము పరగె నిటులు ॥ 74

వ్యాసుని ప్రసాదమున విన్నవాఁడనైతి
కృష్ణ యోగేశ్వరుఁడు తాన్ కథించు చుండ,
పరమ గుహ్య తమమ్మగు భవ్యయోగ
మనెడు శాస్త్రమ్ము సాక్షాత్తు వినంగనైతి ॥ 75

సంస్మరించియు, ఓ రాజ! సంస్మరించి,
కృష్ణపార్థుల సంవాదమిద్ధి, పుణ్య,
మద్భుతమ్మైన దాని, నే మాటి మాటి
కలరుచును నుంటి, మది విస్మయమ్ము చేత ॥ 76

ఆహరిది, విశ్వరూపమ్మొ? అద్భుతమ్ము;
సంస్మరించుచు, ఓ రాజ! సంస్మరింప,
విస్మయము నాకు హెచ్చయి, వెల్లివిరిసె,
తెరలు తెరలుగ మోదమ్మై, తిరిగి తిరిగి ॥ 77

ఎచట యోగేశ్వరుఁడు, కృష్ణుఁడెలమి నుండు,
ఎట ధనుర్ధరుఁడాపార్థు డెలమి నుండు,
అచట, ధ్రువములు : శ్రీయు, జయమ్ము, నీతి,
భూతియు, నటంచు నామతి, భూతలేశ ! 78

ఇటులు
మోక్ష సంన్యాస యోగము పూర్తి.

# మంగళం

ప్రణతులర్పింతు జ్ఞానుల పాదములకు
ప్రణతులర్పింతు భక్తుల పాదములకు
ప్రణతులర్పింతు నిర్గుణ బ్రహ్మమతికి
ప్రణతులర్పింతు గుణగణ బ్రహ్మమతికి
ప్రణతులలనాటి బ్రహ్మవిద్వరులకెల్ల
ప్రణతులీనాటి సత్యవిద్వరులకెల్ల ॥

OM

# Sreemad Bhagavadgeeta
## Tenugu Geetamulu

**G.V.V. Satyanarayana**, B.A., L.T.,
(April 12, 1895 - November 11, 1979)

Teacher/Headmaster, East Godavari District
Board High Schools-Rajole, Amalapuram,
Ramachandrapuram, Kothapeta (1920-50),
Nava Bharati Gurukulam, Rajahmundry (1952-53)
Member, S.S.L.C Board, Madras Presidency (1945-48);
Chief Examiner, S.S.L.C Examinations (1945-48);
Member, Text Book Committee (1945-48); etc.